Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు స్థాపితం: 1930 జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 10 • 9-3-2012 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





# కోవూరు ఫలితాన్ని నిర్ణయించేది బీసీలే!

పక్కనున్న పట్టిక కోవూరు నియోజకవర్గంలో కులాల వారీగా ఓటర్ల లెక్క వివరం. జనాభా లెక్కల సమయంలో అధికారులు సేకరించిన సమాచారం కాబట్టి, పదిశాతం అటు ఇటుగా ఈ సంఖ్యలు సరైనవే అని చెప్పవచ్చు. ఓటర్లను కులాల వారీగా విడదీసి, లెక్కలు తయారు చేయడం ఇదే ప్రథమం. గతంలో ఒక్క ఎస్‌సి, ఎస్‌టి ఓటర్లను మాత్రం విడిగా గుర్తించేవారు. ఇప్పుడు అన్ని కులాలను విభజించి చూపుతున్నారు. ప్రతి ఎన్నికలోనూ కుల ప్రస్తావన వస్తూనే వుంటుంది. కానీ సరైన లెక్కలు లేనందువల్ల దేముడంకెల ఆధారంగా ఆ అంచనాలు వేసుకొనేవారు. వేసుకొన్న అంచనాలకు, వాస్తవానికి పోలిక చూసుకొనే అవకాశం కూడా వుండేది కాదు. ఇప్పుడా సమస్య లేదు.

ఈసారి కోవూరు ఉపఎన్నిక, ఒక నూతన సామాజిక సమీకరణకు వేదిక కాబోతున్నది. ఓటర్ల నిర్ణయం రాజకీయ అంశాల ప్రాతిపదికగా కాక, గ్రామాలలో పెత్తనం కోసం చేసే పోరాటంలో భాగంగా వుండబోతున్నదని పరిశీలకుల అంచనా. మన గ్రామాలలో నూటికి తొంభైశాతం పెత్తనం రెడ్డి కులం చేతిలో వుంటుంది. ఎన్ని పార్టీలు వచ్చినా, వాటి పెద్దరికం మాత్రం ఎవరో ఒక రెడ్డి కుటుంబీకుడికే దక్కడం ఆనవాయితీ. కొన్ని తరాలుగా వస్తున్న సాంప్రదాయం అది. తతిమా కులాల వారందరూ ఆ కుటుంబం ఇష్టాఇష్టాలకు అనుగుణంగా నడుచుకొంటూ వుంటారు. అందువల్లనే ఎన్నికలు వచ్చినప్పుడు గ్రామస్థాయి నేతలను మచ్చిక చేసుకోవడానికి అభ్యర్థులందరూ తాపత్రయపడుతూ వుంటారు. కానీ ఈసారి ఈ పరిస్థితిలో మార్పు వచ్చే సూచనలు కన్పిస్తున్నాయి. జగన్ పట్ల కొన్ని వర్గాల ఓటర్లలో వెల్లువెత్తుతున్న అభిమానం అందుకు కారణం. వైఎస్.రాజశేఖర్‌రెడ్డి పట్ల అభిమానం, సానుభూతి, ఆయన చేసిన మేలుకు కృతజ్ఞత చెప్పుకోవాలన్న అభిలాషలు కలగలసి జగన్ గాలి తుఫాను రూపం ధరిస్తున్నది. ఆ ప్రభంజనం దాటికి తతిమా పార్టీలు ఆచూకీ కూడా లేకుండా పోతాయన్న ప్రచారం జోరుగా నడుస్తున్నది. 108 సేవలు, ఆరోగ్యశ్రీ పథకం, రైతుల రుణ మాఫీ, పావలా వడ్డీ రుణాలు, విద్యార్థుల ఫీజుల చెల్లింపు వంటి సహాయాలు ప్రధానంగా వైఎస్ రాజశేఖర్ రెడ్డి పట్ల ప్రజలలో ఉధృతంగా కన్పిస్తున్న అభిమానానికి కారణం. ఎక్కడకు పోయినా జనం వాటి గురించే మాట్లాడుతున్నారు. అది జగన్‌కు అయాచిత వరంగా ఉపకరిస్తున్నది.

జగన్ మోజును సహజంగానే గ్రామాలలో రెడ్డి కుటుంబాలు తమ స్వంతం చేసుకొంటున్నాయి. జగన్ తమ వాడిగా భావిస్తున్నారు. దాన్ని చాటుకోవడం కోసం తమ తమ పార్టీల అనుబంధాలను పక్కన పెట్టి ఏకత్రాటి మీద పని చేస్తున్నారు. ఈ ఉత్సాహం, తతిమా కులాలలో అనుమానాలు, అసూయను కల్గిస్తున్నది. వెనుకబడిన కులాలలో ఈ ఆలోచన అధికంగా కన్పిస్తున్నది.

కోవూరు నియోజకవర్గంలో వెనుకబడిన కులాలకు చెందిన ఓటర్ల సంఖ్య దాదాపు 36శాతం వరకు వుంది. వీరిలో యాదవులు, గౌడ కులస్తులు, పట్టపు కాపులు అగ్రభాగంలో వున్నారు. మొత్తం ఓటర్లలో బిసి కులాల సంఖ్య చూస్తే, ఈ ఎన్నిక ఫలితాన్ని నిర్దేశించే సత్తా, సామర్థ్యం బిసి కులాలకు మాత్రమే వుందని చెప్పవచ్చు. వారిలో మెజార్టీ అభిప్రాయం మొగ్గిన పార్టీకే విజయం సిద్ధిస్తుంది.

నూటికి తొంబై శాతం గ్రామ పెత్తనం చేసే రెడ్డి కులం ఓట్లు కేవలం 12 శాతం లోపు. ఈ ఎన్నికలో అధిక శాతం మాలల మొగ్గు జగన్ వైపు వుందని భావిస్తున్నారు. వారు కూడా దాదాపు 12శాతం వరకు వున్నారు.

ఈ ఉప ఎన్నికలో గిరిజన, పట్టపు కాపుల మనోభావాలు ఎట్లా వున్నాయో ఇంకా స్పష్టం కాలేదని గతవారం అనుకొన్నాము. గిరిజనుల విషయంలో ఇప్పటికీ అదే సందిగ్ధ స్థితి నెలకొని వుంది. అయితే కోవూరులో గిరిజనుల సంఖ్య అధికం అనే ప్రచారం ఒకటి వుంది. అందువల్లనే గత ఎన్నికలలో చిరంజీవి తన ప్రజారాజ్యం పార్టీ తరఫున తుపాకుల మునెమ్మను ఇక్కడ అభ్యర్థిగా నిలబెట్టాడు. కానీ లెక్క చూస్తే వారి సంఖ్య 8శాతం మాత్రమే. రెడ్లు, మాలలు, యాదవులు గిరిజనుల

కొరవ 14వ పేజీలో

### కులాల లెక్కలో కోవూరు ఓటర్లు

| | | |
|---|---|---|
| రెడ్డి | : | 24653 |
| కమ్మ | : | 9659 |
| బ్రాహ్మణ | : | 3212 |
| వైశ్య | : | 4665 |
| బలిజ | : | 12572 |
| మాల | : | 25956 |
| మాదిగ | : | 11267 |
| యానాది | : | 16820 |
| **బిసి కులాలు** | | |
| యాదవ | : | 14395 |
| గౌడ | : | 9208 |
| వడ్డెర | : | 3859 |
| రజక | : | 3551 |
| పద్మశాలి | : | 5139 |
| కంసాలి | : | 1408 |
| నాయిబ్రాహ్మణ | : | 1846 |
| బెస్త | : | 5849 |
| పట్టపు | : | 8303 |
| దేవాంగ | : | 7204 |
| ముదిరాజ్ | : | 4424 |
| ఉప్పర | : | 2396 |
| ఎరుకల | : | 1126 |
| బొందిలి | : | 2726 |
| దూదేకుల | : | 1750 |
| ఇతర బిసి | : | 6438 |
| (గాండ్ల, దాసరి, జంగం, కుమ్మర, బోయ, దొమ్మర తదితర కులాలు) | | |
| **మొత్తం బిసి** | : | **76896** |
| **ముస్లిం** | : | **13704** |
| **క్రైస్తవ** | : | **1382** |
| **ఇతరులు** | : | **9737** |

## కార్టూన్ స్కేప్

జగన్
జగన్ రోడ్‌షోకు జనం కరువు
నందు

బాధపడ్తారేంటి సార్! రోడ్లు చూసి రావడం కూడా రోడ్ షోనే కదా!

# కాంగ్రెస్‌కు చావు దెబ్బ!

ఐదు రాష్ట్రాల శాసనసభ ఎన్నికలు కాంగ్రెస్ పార్టీకి, మరీ ముఖ్యంగా రాహుల్‌గాంధీకి శరాఘాతం వలె పరిణమించాయి. ఆ పార్టీ రాజకీయ భవిష్యత్తు మీదనే నీలినీడలు ప్రసరింపచేశాయి. తాము అధికారంలో వున్న గోవాలో దారుణమైన ఓటమిని చవి చూసింది కాంగ్రెస్ పార్టీ. 40 సీట్ల శాసనసభలో అది గెలిచిన స్థానాలు తొమ్మిదంటే తొమ్మిది మాత్రమే. బిజెపిని అధికార పీఠం నుంచి క్రిందకు తోసి వేయడం ఖాయమనుకొన్న ఉత్తరాఖండ్ రాష్ట్రంలో. చావు తప్పి కన్ను లొట్టపోయినట్లు బిజెపి కంటే ఒకే ఒక్క స్థానం అధికంగా గెలుచుకొని సంతృప్తి చెందవలసి వచ్చింది. ఈశాన్య రాష్ట్రమైన మణిపూర్‌లో మాత్రమే పరువు దక్కింది. కానీ ఆ రాష్ట్రంలో గెలుపు ఓటముల ప్రభావం జాతీయ రాజకీయాలపై లేశ మాత్రం కూడా వుండదు. ఆ శక్తి కల్గిన పంజాబ్, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలలో కాంగ్రెస్‌కు ఎదురైన పరాజయ పరాభవం ఎవరూ వూహించనిది; ఇప్పట్లో కోలుకోవడం వీలు కానిది.

ఉత్తరప్రదేశ్ మీద రాహుల్‌గాంధీ చాలా కలలే కన్నాడు. జాతీయ రాజకీయాలలో ఆ రాష్ట్రం ప్రాధాన్యత అంతా ఇంతా కాదు. 80 లోక్‌సభ స్థానాలున్న అతి పెద్ద రాష్ట్రం. కానీ గత 23 ఏళ్ళుగా అక్కడ కాంగ్రెస్‌కు నిలువ నీడ లభించడం లేదు. 1989లో చివరిసారిగా ఎన్.డి.తివారి ముఖ్యమంత్రిగా దిగిపోయిన నాటి నుంచి ఉత్తరప్రదేశ్‌లో కాంగ్రెస్‌కు ప్రభుత్వం ఏర్పాటు చేసే అవకాశం కలగలేదు. బీహార్, ఉత్తరప్రదేశ్‌లలో పట్టుకోల్పోయినందువల్లనే కేంద్ర ప్రభుత్వంలో సంకీర్ణ రాజకీయాల అవసరం ఏర్పడింది. చిన్నా చితక పార్టీల మీద ఆధారపడి జాతీయ ప్రభుత్వాన్ని నడపవలసిన దుర్గతి కాంగ్రెస్, బిజెపిలకు పట్టింది. ఈ దుస్థితి నుంచి బయటపడాలంటే ఉత్తరప్రదేశ్‌లో తన పార్టీకి పునః ప్రాణ ప్రతిష్ఠ చేయాలని ఆశపడ్డాడు రాహుల్‌గాంధీ. ఆ విజయంతోనే, తనను తాను సమర్ధుడైన రాజకీయ నేతగా రుజువు చేసుకొని మరీ ప్రధానిత్వపు పగ్గాలు చేపట్టాలని కలలు కన్నాడు. అందుకోసం గత మూడేళ్లుగా ఎంతో శ్రమించాడు. తన శక్తి యుక్తులు, సమయం మొత్తం ఆ రాష్ట్రానికే అంకితం చేశాడు. కానీ ఉత్తరప్రదేశ్ ప్రజలు మాత్రం ఆయన్ను నిర్మొగమాటంగా తిరస్కరించారు. రాష్ట్రంలో పార్టీ ప్రాణ ప్రతిష్ఠ సంగతి దేముడెరుగు, ఆయన స్వంత అమేధీ నియోజకవర్గంలో కూడా కాంగ్రెస్‌ను ఓడించి, పరువు తీశారు.

పంజాబ్‌లో కూడా దారుణమైన పరాజయ పరాభవం. అకాలీదళ్, బిజెపి కూటమి మరొకసారి విజయం సాధించడం ఎవరూ వూహించని పరిణామం. అన్ని టీవీ ఛానళ్లు, పేరు ప్రఖ్యాతులు కల్గిన పత్రికా సంస్థలు, కొమ్ములు తిరిగిన రాజకీయ పండితులు ఈ ఫలితాన్ని చూసి బిత్తరపోయారనడం నిజం. భారతీయ ఓటరు విజ్ఞత ముందు ఎగ్జిట్ పోల్స్, ఒపీనియన్ పోల్స్ అంచనాలు బొక్క బోర్లా పడక తప్పదని మరొకసారి రుజువైంది.

కాంగ్రెస్‌కు ఇంతటి దారుణమైన ఓటమి అవమానం ఎదురుకావడానికి కారణాలు వెతకవలసిన అవసరం లేదు. కేంద్రంలోని మన్మోహన్‌సింగ్ ప్రభుత్వం అవినీతికి ఆనవాలుగా మారిపోవడం, ప్రజా వ్యతిరేక విధానాలకు పెద్ద పీట వేయడం వల్లనే ఉత్తరాది ప్రజలు కాంగ్రెస్‌ను ఇంత కఠినంగా శిక్షించారని చెప్పవచ్చు. ఆయన ప్రభుత్వంలోని మంత్రులు ఒకరి వెంట ఒకరుగా తీహార్ జైలుకు ప్రయాణం కడుతున్నారు. కానీ అటు ప్రధానిలో, ఇటు పార్టీ నేత సోనియాగాంధీలో అణుమాత్రం పరివర్తన లేదు. అవినీతి నిర్మూలనకు వారు చిత్తశుద్ధితో చేసిన ప్రయత్నం అసలే లేదు. పైపెచ్చు 2జి కుంభకోణాన్ని కప్పి పెట్టడానికి విఫల ప్రయత్నం చేశారు. మరొకప్రక్క రాజకీయ వ్యవస్థలో అవినీతి నిర్మూలనకు అన్నా హజారే ప్రారంభించిన ఉద్యమానికి జాతి యావత్తు ఏకత్రాటి మీద నిలబడి మద్దతు తెలిపితే, ఆ ఉద్యమాన్ని అణిచివేసే కుటిల యత్నాలు చేశారు. ధరల పెరుగుదలను నిరోధించడంలో కేంద్ర సర్కారు ఘోరంగా విఫలమైంది. నెలకు రెండుసార్లు పెట్రోల్ ధరలు పెరగడంతో ద్రవ్యోల్బణం హెచ్చింది. ఆర్థిక సంస్కరణల పేరిట బహుళజాతి సంస్థల ప్రయోజనాలకు పెద్ద పీట వేసి ప్రజల జీవితాలు దెబ్బతినిపోయాయి. ఆ ప్రజా వ్యతిరేక విధానాలకు నిరసనగానే ఉత్తరాది రాష్ట్రాలలో ఈ ఫలితాలు వచ్చాయని నిస్సందేహంగా చెప్పవచ్చు.

జమీన్‌రైతు

## జనవాణి

### జగన్‌పై అభిమానమే ప్రసన్నను గెలిపిస్తుంది!

తన పరిపాలనా కాలంలో రాష్ట్ర ప్రజలందరికీ ఎంతో మేలు చేసిన మహానేత స్వర్గీయ వైఎస్.రాజశేఖర్‌రెడ్డి, ఆయన ఆశయ సాధనకు రాజకీయాల్లోకి వచ్చిన వైఎస్ జగన్మోహన్‌రెడ్డిని రాష్ట్ర ప్రజలంతా ఎంతో అభిమానిస్తూ ఆదరిస్తున్నారు. జగన్ ఎక్కడికి వెళ్లినా ప్రజలు పలుకుతున్న నీరాజనాలు ఆయనకున్న జనాకర్షక శక్తికి నిదర్శనం. కోవూరు నియోజకవర్గంలో జరుగుతున్న ఉప ఎన్నికల్లో వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ అభ్యర్థిగా పోటీచేస్తున్న నల్లపరెడ్డి ప్రసన్న కుమార్‌రెడ్డి గెలుపుకు ఎటువంటి ఢోకా లేదు. జగన్‌కు వున్న ప్రజాదరణే ప్రసన్నను భారీ మెజార్టీతో గెలిపించడం ఖాయం.

బిఆర్.శాలి — కావలి

### అపహాస్యం చేయకండి!

విశృంఖలంగా పెరిగిపోయిన అవినీతిని కొంతవరకైనా రూపు మాపేందుకు పౌరసమాజం దశాబ్దాలుగా చేసిన ఉధృత పోరాట ఫలితం సమాచార హక్కు చట్టం. ప్రజల చేతిలో పాశుపతాస్త్రం వంటి దివ్యాయుధంతో ఇప్పటి వరకు దాచి పెడుతున్న సమాచారాన్ని బయటకు లాగడం సుసాధ్యం. అయితే ఈ చట్టం యొక్క స్ఫూర్తిని మన ప్రభుత్వం చట్టుబండలు చేస్తోంది. రెండేళ్లుగా సమాచార కమిషనర్లను నియమించకుండా తాత్సారం చేసి, చివరకు నిబంధనలను తుంగలోతొక్కి పైరవీలు చేసిన రాజకీయ నాయకులకు, ప్రభుత్వాధికారులకు ఈ పదవులు కట్టబెట్టడం బాధాకరం. చట్టం పట్ల కనీస అవగాహన లేనివారు ఈ పదవిని సమర్థవంతంగా నిర్వహించలేరు. రాజకీయ నేతల ఆగమనంతో సమాచార చట్టం త్వరలోనే నిర్వీర్యమైపోతుందనడంలో ఎటువంటి సందేహం లేదు.

పి.అరుణకుమారి — నెల్లూరు

### రైల్వే సమస్యలు పట్టవా?

వెంకటగిరి – నడికుడి రైల్వే లైను నిర్మాణం ప్రతిపాదన 1985 నుండి రావణాసురిడి కాష్టంలా రగులుతూనే వుంది. దాని ప్రాధాన్యత గూర్చి అందరూ మాట్లాడడమేగానీ గుర్తించినవారు లేరు. రైలు చూడని పల్లెల్లో ఈ మార్గం వెళ్తూ రాజధానిని చేరుతుంది. దీన్ని "ఫెయిర్ వెదర్ రూట్" అని కూడా నామకరణం చేశారు. తరచూ వర్షాలు, వరదలు, తుఫాన్ల తాకిడికి లోనయ్యే ప్రస్తుతం వున్న రైలు దారికి ప్రత్యామ్నాయంగా దీనిని రూపొందించారు. హైదరాబాద్ దూరం కూడా 100 కిలోమీటర్లు నెల్లూరు నుంచి తగ్గుతుంది. ఈ రైలు మార్గం నిర్మాణ వ్యయం అంచనా వేశారు. సర్వే రెండుసార్లు చేశారు. బడ్జెట్‌లో నామమాత్రం కేటాయింపులు కంటితుడుపుగా కేటాయించడం వల్ల ఎక్కడ వేసిన గొంగడి అక్కడే వుంది. రాష్ట్రం నుంచి లోక్‌సభ, రాజ్యసభలలో 50 మంది

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

13-3-1942
పేజీలు : 10 వెల: అణా

### నెల్లూరు ముచ్చట్లు

పైడా సుబ్బరామయ్యగారు అఖిలభారత హిందూ మహాసభ వర్కింగ్ కమిటీ సభ్యుడు అయినందుకు వారిని మేం అభినందిస్తున్నాం. ఏ ఉద్యమం గూడా నాయకుని త్యాగం మీద ఆధారపడి వుంటుంది. సుబ్బరామయ్య గూడా నేను ఫైనాన్స్ అద్యయిజరుగా వుంటానంటే నెల్లూరులో హిందూ మహాసభ ఏ గతి బట్టి వుండునో? వర్తకులు పిరికివారు కారు అనే దానికి 101 గోత్రాల పక్షాన వీరే తార్కాణం. అసలు పిరికివారికి మందు నూరి అంగట్లో అమ్ముతున్నారు. వీరి అభిప్రాయాలతో మేము ఏకీభవించలేకపోయినా వీరి ధైర్య త్యాగాలను, సంఘసేవను మేము అభినందిస్తున్నాము.

***

పొరుగింటి పుల్లకూరను లొట్టలు గొట్టే ఈ దినాల్లో మన పొట్లూరి చెంచురామయ్య చేత గునుపాటి రాధయ్యని (బ్రైన్ మర్చంటు. ఇది ఆయన ఆహ్వానాల్లో వేసుకొన్న మాటేలేండి) ఫ్లూటు కచేరి జరిపించడం మెచ్చుకోదగ్గదే. తన పెరటి చెట్టు యందు అనే ఉదాసీనాన్ని, మనవాడు అనే దురభిమానాన్ని విసర్జించి వుంటే ఆ మురళి మధురంగానే వినిపించింది.

### సైదాపురం ఎలక్షన్

ఫారెస్టు ఎలెక్షన్ 18 తేదీన జరుగుతుంది. రోడ్లు వేయిస్తాం. గుళ్లు కట్టిస్తాం. కూలదోయిస్తాం, ముండమోయిస్తాం, అని ఎలెక్షన్ ప్రచారాలు పల్లెల్లో సాగుతున్నవి. వాటి సంగతనట్లుంచండి.

అబ్బూరు గారు! ఈ మాట తాము మానుకొని నెల్లూరు శీతారాంరెడ్డికి అవకాశమిస్తే గ్రామం బాగు పడుతుంది. ఏమంటారు?

## 50 ఏళ్ల క్రితం ఈవారం

9-3-1962
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### ఏ.సి.సుబ్బారెడ్డికి మంత్రిత్వం ఖాయం

కాంగ్రెస్ అధ్యక్షుడు నీలం సంజీవరెడ్డి 26 మాసాల అనంతరం, తిరుగా ఆంధ్రప్రదేశ్ శాసనసభ కాంగ్రెస్ పార్టీ నాయకత్వానికి ముక్తకంఠంతో వరింపబడినాడు. 7తేది జరిగిన నూతన శాసనసభ్యులు, కౌన్సిల్ సభ్యుల సమావేశంలో సంజీవరెడ్డిగారి పేరును ప్రస్తుత నాయకుడు దామోదరం సంజీవయ్య ప్రతిపాదించగా అల్లూరు సత్యనారాయణరాజు గారు బలపరచారు. పోటీ వుంటుందనే విశాలాంధ్ర పత్రిక గొంతెమ్మకోర్కె, పాపం! నెరవేరలేదు.

నాయకత్వ ఎన్నిక జరిపిన వెంటనే గవర్నర్ సచార్ సంజీవరెడ్డి గారిని ఆహ్వానించి మంత్రివర్గాన్ని ఏర్పాటు చేయమని కోరడం, దానికి వారు అంగీకరించడం జరిగిపోయింది. సంజీవరెడ్డి మంత్రివర్గ ప్రమాణ స్వీకారం సోమవారం (12వతేది) వుంటుంది. సంజీవరెడ్డి గారి మంత్రివర్గంలో ఏ.సి.సుబ్బారెడ్డిగారు మాత్రం తప్పక వుండగలరని తెలుస్తున్నది.

### డాక్టర్ గోపాలరెడ్డి

మార్చి 1తేది మద్రాసు నుంచి నెల్లూరు విచ్చేసిన డాక్టరు బెజవాడ గోపాలరెడ్డి 5వతేది రాత్రి డీలక్స్ రైలులో కుటుంబ సమేతంగా ఢిల్లీకి బయలుదేరి పోయారు. స్టేషనులో వారికి కలెక్టరు వగైరా అధికారులు, అనేకమంది అభిమానులు వీడ్కోలిచ్చారు.

గోపాలరెడ్డి 4వతేది స్వగ్రామమైన బుచ్చిరెడ్డిపాళెంలో గడిపారు. నెల్లూరులో వారున్న రోజులలో వందలాదిమంది వారిని పరామర్శించారు. గోపాలరెడ్డి తిరుగా తాను జూన్‌లో రాగలనని చెప్పారు.

# నెల్లూరు ముచ్చట్లు

## సిఎం రాక!

కోవూరు ఉపఎన్నికల ప్రచారానికి ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి 9వ తేదీ జిల్లాకు తరలివస్తున్నారు. కాంగ్రెస్ పార్టీ అభ్యర్థి పోలంరెడ్డి శ్రీనివాసులురెడ్డి స్వగ్రామం నార్తురాజుపాళెంలో ఏర్పాటు చేసే బహిరంగ సభలో ఆయన మాట్లాడుతారు.

## బాబునోట బైబిల్‌లో మాట!

4వ తేదీ కోవూరు ఉపఎన్నికల ప్రచారానికి వచ్చిన తెలుగుదేశం పార్టీ సర్వసైన్యాధ్యక్షుడు చంద్రబాబునాయుడు వైఎస్ జగన్మోహన్‌రెడ్డి, నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి అవినీతిపరులని ప్రతి సభలోనూ గట్టిగా చెప్పారు. ఇంకాస్త ముందుకెళ్లి అవినీతిపరులకు సహకరించకూడదని 'బైబిల్' చెబుతుందన్నారు. కోవూరు నియోజకవర్గంలో ఓ స్థాయిలో ఉన్న క్రిస్టియన్ ఓటర్లలో పెల్లుబుకుతున్న జగన్ అభిమానానికి అడ్డు కట్టవేయను 'ఆదివారం' బాబు నోట ఈ మాట వెలువడిందని రాజకీయ పరిశీలకులు విశ్లేషిస్తున్నారు.

## మళ్లీ చంద్రబాబు

కోవూరు ఉపఎన్నికల్లో ప్రచార నిమిత్తం 8, 15 తేదీల్లో తెలుగుదేశం పార్టీ అధినేత నారా చంద్రబాబు నాయుడు ఇందుకూరుపేట, కోవూరు, కొడవలూరు, విడవలూరు మండలాల్లో పర్యటిస్తారు.

## చిరంజీవి, బొత్సా రాక

కోవూరు ఉపఎన్నికల ప్రచారంలో పాల్గొనేందుకు మెగాస్టార్, తిరుపతి ఎమ్మెల్యే చిరంజీవి 12వ తేదీ నెల్లూరు వస్తున్నారు. పిసిసి అధ్యక్షుడు బొత్సా సత్యనారాయణతో కలసి ఆయన 13వ తేదీ మరోసారి కోవూరు నియోజకవర్గంలో పర్యటిస్తారు.



## నెల్లూరులో కంచి స్వామి!

కంచి కామకోటి పీఠాధిపతి జయేంద్ర సరస్వతి 4వ తేదీ నెల్లూరు వచ్చారు. రాజరాజేశ్వరమ్మ, స్టోన్‌హౌస్ పేటలోని కన్యకాపరమేశ్వరి దేవస్థానాలను సందర్శించి ప్రత్యేక పూజలు, భక్తులకు తన సందేశం వినిపించారు. ఆ రోజు రాత్రి మూలపేటలోని కంచి పీఠం మఠంలో విశ్రాంతి తీసుకొని అమలాపురం బయలుదేరి వెళ్లారు.

## నేనే పోటీ చేస్తా!

పార్టీ అధిష్టానం ఆదేశిస్తే నెల్లూరు పార్లమెంట్ స్థానం నుంచి కాంగ్రెస్ పార్టీ అభ్యర్థిగా పోటీకి రెడీ అని రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి ప్రకటించారు. 2014 ఎన్నికల్లో రూరల్ నియోజకవర్గం నుంచి పోటీ కష్టమని ఆయన ప్లేటు ఫిరాయించి పార్లమెంటుకు పోటీ చేస్తానని ప్రకటించినట్లున్నారు. గతవారం వరకు వాళ్లు, వీళ్లు నెల్లూరులో పోటీచేస్తారని ఎక్కడెక్కడి వారి పేర్లు చెప్పిన వివేకా ఇప్పటికి తన మనసులో మాట బయట పెట్టాడు.

## ఓట్లువేసేది మాకే!

కోవూరు ఉపఎన్నికల ప్రచారంలో ప్రజలు తెలుగుదేశం, కాంగ్రెస్ పార్టీల వైపు ప్రచారపర్వంలో తిరిగినా ఎన్నికల రోజు మాత్రం ఎలక్ట్రానిక్ ఓటింగ్ మిషన్ మీట నొక్కేది వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీకేనని నెల్లూరు తాజా మాజీ ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి భరోసాగా చెబుతున్నారు. నియోజకవర్గంలోని ఎన్నికల ప్రచార సభల్లో ఆయన మాట్లాడుతూ వారితో తిరగండి, డబ్బులు తీసుకోండి. చివరి రోజు చేయాల్సింది చేయమని చెప్పడం కొసమెరుపు.

## వాళ్లు ప్రత్యర్థులే కాదు!

కోవూరులో కాంగ్రెస్ అభ్యర్థి పోలంరెడ్డి శ్రీనివాసులురెడ్డి విచిత్రమైన వాదనను తెరపైకి తెచ్చాడు. కోవూరులో తెలుగుదేశం, వైకాపా పార్టీల తరపున పోటీచేస్తున్న సోమిరెడ్డి చంద్రమోహన్ రెడ్డి, నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి తనకు అసలు ప్రత్యర్థులే కాదన్నాడు. వాళ్లిద్దరూ అవినీతిపరులు. కోవూరులో ప్రస్తుతం నా హవా(గాలి) వీస్తుంది. నేను గెలవడం ఖాయమంటున్నారు. మనమెందుకు కాదనాలి... అలాగే కానివ్వండి.

## ప్రసన్నకు ఎన్ని పేర్లో!

కోవూరు ఉప ఎన్నికల ప్రచారపర్వంలో ప్రధాన ప్రత్యర్థులు ఒకరినొకరు బాగా తిట్టుకొంటున్నారు. ప్రసన్నను ఆయన ప్రత్యర్థి సోమిరెడ్డి చంద్రమోహన్ రెడ్డి దుర్యోధనుడు, శకుని, జంప్ జిలానీగా అభివర్ణించాడు. అంతటితో ఆగలేదు మా మామ శ్రీనివాసులురెడ్డి అసెంబ్లీ టైగర్... ఆయన కడుపున ప్రసన్న పిల్లిలా పుట్టాడని శాపనార్థాలు పెట్టారు. రాజకీయ నాయకుల్లోనే ప్రసన్న లాంటి అవలక్షణాలు కల్గిన మరో నేత రాష్ట్రంలోనే లేడని తేల్చి చెప్పేశాడాయన.

## ప్రసన్నకు ఫ్యాన్ గుర్తు!

వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీని ఇంకా ఎన్నికల సంఘం గుర్తించనందున కోవూరులో ప్రసన్న ఇండిపెండెంట్‌గానే రంగంలో ఉన్నట్లు. కానీ ఆయనకు విచిత్రంగా కడప, పులివెందుల ఎన్నికల్లో వైకాపా పార్టీ తరపున గెలిచిన జగన్మోహన్‌రెడ్డి, విజయమ్మలకు ఇచ్చిన ప్రచార గుర్తు 'ఫ్యాన్'ను కోవూరులోనూ ప్రసన్నకు ఎన్నికల అధికారులు కేటాయించారు. కేవలం రెండు వారాల్లో ఈ గుర్తును జనంలోకి తీసుకెళ్లి ఓట్లు వేయించుకోవాల్సిన బృహత్తర బాధ్యత ప్రసన్నమీద ఉందనాలి.

## చంద్రశేఖర్‌రెడ్డికి అదోరకం కీర్తి!

జిల్లాలో ఇప్పటివరకు శాసన సభ్యులుగా పనిచేసిన ఎవ్వరి మీద పార్టీ వ్యతిరేక కార్యకలాపాలకు పాల్పడినందుకు అనర్హతవేటుతో ఎమ్మెల్యే పదవి పోలేదు. కానీ ఉదయగిరి ఎమ్మెల్యే మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి స్వంత పార్టీ వ్యతిరేక కార్యకలాపాలకు పాల్పడిన ఎమ్మెల్యేగా స్పీకర్ ఆయన్ను ఆ పదవికి అనర్హుడిని చేస్తూ వేటు వేశారు. స్పీకర్ తనపై అనర్హత వేటు వేసినందుకు చంద్రశేఖర్‌రెడ్డి సంతోషం వ్యక్తం చేయడం వినేవారికి కాస్త విచిత్రమనిపిస్తుంది.

## సిపిఎంకు సిపిఐ జై!

ఉపఎన్నికలు జరుగుతున్న కోవూరు స్థానంలో పోటీచేస్తున్న సిపిఎం అభ్యర్థి వెంకమరాజుకు సిపిఐ పార్టీ మద్దతు ప్రకటించింది. ఈ మేరకు సిపిఐ జిల్లా కార్యదర్శి వి.రామరాజు ఒక ప్రకటన కూడా చేశారు.

## సోమిరెడ్డి పోరాటయోధుడు

సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డిని పోరాటయోధునిగా ఆ పార్టీ రాష్ట్ర అధ్యక్షుడు నారా చంద్రబాబు నాయుడు అభివర్ణించాడు. 4వ తేదీ బుచ్చి మండలంలో చంద్రమోహన్ రెడ్డికి మద్దతుగా ప్రచారం చేసిన చంద్రబాబు మాట్లాడుతూ జిల్లాలో థర్మల్ విద్యుత్ కేంద్రాలకు వ్యతిరేకంగా సోమిరెడ్డి పోరాడాడు. గతంలో మద్య వ్యతిరేక పోరాటం చేశాడు. జిల్లాలో అధికార పక్షాన్ని ఒంటరిగా ఎదుర్కొంటున్నాడు. ఆయనింక కోవూరు నియోజకవర్గాన్ని వదలిపోడు. 2014 లోనూ ఇక్కడ నుంచే పోటీచేస్తాడని చంద్రబాబు ప్రకటించారు.

## కార్పొరేషన్ పెట్రోల్ బంకు

నెల్లూరు మునిసిపల్ కార్పొరేషన్ తన వాహనాల ఇంధన కొరతను తీర్చుకొనేందుకు స్వంతంగా పెట్రోల్ బంకును పెట్టుకోనుంది. పాత కలరా షెడ్డు ప్రాంతంలో భారత్ పెట్రోలియం లిమిటెడ్ నేతృత్వంలో ఏర్పాటుచేసే ఈ బంకు నిర్మాణానికి ఎనిమిది లక్షల రూపాయలు ఖర్చు పెడుతుంది. రాష్ట్రంలో స్వంత పెట్రోల్ బంకు ఉన్న కార్పొరేషన్‌గా నెల్లూరు సరికొత్త రికార్డు సృష్టించింది.

## తిట్లకు కోడ్ ఉంది

కోవూరు ఉపఎన్నికల్లో పోటీ చేస్తున్న అభ్యర్థుల మధ్య విమర్శలు శృతి మించుతున్నాయి. వీరు దిగజారి ఒకరి నొకరు దుమ్మెత్తి పోసుకొంటున్నారు. శవాలపై చిల్లర ఏరుకొనే వాడని ఒకరు, దొంగకోళ్లు పట్టేవాడని మరొకరు దూషించుకొంటున్నారు. అయితే ఈ దూషణలకు ఒక హద్దు ఉందని ఎన్నికల కోడ్ వీటికి వర్తిస్తుందని చెప్తున్నాడు జిల్లా కలెక్టర్ శ్రీధర్. వీటిపై ఏ పార్టీ వారైనా ఫిర్యాదుచేస్తే చర్య తీసుకొంటామని అంటున్నారు. కానీ అభ్యర్థులు కంటికి కన్ను, పంటికి పన్నులాగా వారు ఒకటంటే వీరు మరో రెండు ఎక్కువ అంటున్నారు తప్ప ఎవరొచ్చి ఎన్నికల కమిషన్‌కు ఫిర్యాదు చేస్తారు!

## అభిమానుల అలక

ఉప ఎన్నికలలో కోవూరు బరిలో ఉన్న టిడిపి అభ్యర్థి సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి విజయం కోసం ఎన్టీఆర్, బాలకృష్ణ, జూనియర్ ఎన్టీఆర్ ఫ్యాన్స్‌తో టిడిపి నేతలు ఇటీవల సమావేశం నిర్వహించారు. అందరూ కలసికట్టుగా పని చేసి అభ్యర్థిని గెలిపించాలని ఎర్రం నాయుడు కోరగా ఒక్కసారిగా అభిమానులు లేచి తమ ఆవేదన, అక్కసు వెళ్లగక్కారు. ఎన్నికలొచ్చినపుడే అభిమానులం గుర్తుకు వస్తామని ఏదైనా పని పడి ఫోన్‌చేస్తే మాత్రం ఫోన్ ఎత్తరని, కట్ చేస్తారని అంత అలుసైపోతే మేమెందుకు ఎన్నికల్లో పనిచేయాలని బాహాటంగానే ప్రశ్నించారు. దీంతో కంగుతిన్న నేతలు వారిని సముదాయించేందుకు పడరాని పాట్లు పడ్డారు.

## పొదుపు ఖాతాలపై నిఘా

ఉప ఎన్నికల్లో అభ్యర్థులు ఓటర్లను మభ్యపెట్టేందుకు ఎన్నో ఎత్తులు పైఎత్తులు వేస్తున్నారు. ఎన్నికల కమిషన్ డేగ కళ్లతో పరిశీలిస్తున్న నేపథ్యంలో డబ్బు చేర్చేందుకు పొదుపు సంఘాల సభ్యుల ఖాతాలను తెలుసుకొని వాటిలో నేరుగా జమ చేసేందుకు ప్రయత్నిస్తున్నారట. దీనిని తెలుసుకొన్న అధికారులు పొదుపు ఖాతాలపై నిఘా పెట్టారు. వాటి లావాదేవీలను ప్రతిరోజూ అందజేయాలని బ్యాంకులకు సమాచారం అందించినట్లు జిల్లా కలెక్టర్ శ్రీధర్ తెలిపారు.

## మంత్రికి కొమ్ముకాచిన పోలీసుల సస్పెన్షన్

ఎన్నికల నిబంధనలు బేఖాతర్ చేస్తూ ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి వాహనాలను తనిఖీ చేయ

కొరవ 14వ పేజీలో

# మార్కుల కోసం ప్యాకేజీలు!

## ● విద్యాశాఖలో మరో కుంభకోణం

పదవ తరగతి పరీక్షల్లో అత్యధిక మార్కులు పొందేందుకు, స్కూళ్ల పేరు ప్రతిష్టలు పెంచుకొనేందుకు కార్పొరేట్ స్కూళ్ల యాజమాన్యాలు కాసుల వర్షం కురిపిస్తున్నాయి. తమకు అనుకూలంగా ఉండే వారిని చీఫ్, డిపార్ట్‌మెంటల్ అధికారులుగా నియమించుకొనేందుకు ఉన్నతాధికారితో ఒప్పందం కుదుర్చుకొన్నట్లు సమాచారం. ఇందుకోసం ఆయా పాఠశాలల యాజమాన్యాలు ఆ అధికారికి పెద్ద మొత్తంలో నజరానాను అందించేందుకు సిద్ధమయ్యాయట. అంతేకాకుండా తమ పట్ల స్వామి భక్తిని ప్రదర్శించే విద్యాశాఖ సిబ్బంది దగ్గర్నుంచి పరీక్షల అధికారులు, ఇన్విజిలేటర్ల వరకు వారి వారి స్థాయినిబట్టి నగదు, బంగారు ఆభరణాలు, పెద్ద బహుమతులతో ప్యాకేజీగా మాట్లాడుకొన్నారట. ఇవి కాకుండా నిత్యం గ్లాసుల గలగలలతో కూడిన మందు, తిన్నంత ఫుడ్‌తో వారు విదిలించే లంచాలతో విద్యాశాఖ అధికారులు, సిబ్బంది, ఉపాధ్యాయులు తడిసి ముద్దవుతున్నారట. ఉపాధ్యాయులలో



అవినీతి నిలయంగా మారిన డిఇఒ ఆఫీసు.

చాలామంది ఏదో ఒక పాఠశాలలో పార్ట్‌టైమ్ పనిచేసేవాళ్లు, ప్రత్యేక తరగతులకు హాజరయ్యేవారు అధికం. వీరు కాకుండా కొందరు అయ్యోర్లు బ్రోకర్లుగా మారి మీకెందుకు, మీ విద్యార్థులు పరీక్షలు బాగా వ్రాసేలా చూస్తామంటూ దండుకొనేవారూ దండిగా ఉన్నారు. పరీక్ష ప్రారంభానికి కొద్ది సమయానికి ముందే ప్రశ్నాపత్రం బయటకు పంపేందుకు, పరీక్ష సమయం ముగిసిన తర్వాత అరగంటపాటు ఎంపిక చేసిన విద్యార్థుల బిట్‌పేపర్ పరిశీలించి, సమాధానాలు చెప్పేందుకు భారీమొత్తంలో నగదు చేతులు మారుతోందట. ఇంతకేముంది పరీక్షల్లో అక్రమాలకు తెరతీశాయి కార్పొరేట్ పాఠశాలలు.

# మురికివాడల అభివృద్ధికి రూ.50 కోట్లు!

## కార్పొరేషన్‌కు నిధులు మంజూరు చేసిన కేంద్రం



కార్పొరేషన్‌కు నిధుల వరద.

మునిసిపల్ కార్పొరేషన్ల పరిధిలోని మురికివాడలను అభివృద్ధి పరచేందుకు గతంలో రాజీవ్ ఆవాస్ యోజన పథకం కేంద్ర ప్రభుత్వం ప్రవేశపెట్టింది. నగరంలోని మురికివాడల అభివృద్ధి ఎలా చేయాలన్న దానిపై రెండు, మూడు దఫాలు సర్వే నిర్వహించారు. తొలుత 750 కోట్ల రూపాయలు అవసరమౌతాయని సర్వే జరిపిన అధికారులు ప్రతిపాదించారు. ఈ పథకం ద్వారా కేంద్ర ప్రభుత్వం దేశంలోని అన్ని మునిసిపల్ కార్పొరేషన్లలోని మురికివాడలను వివిధ దశల్లో అభివృద్ధి చేయాలని నిర్ణయించింది. 2010 సంవత్సరంలో నిధుల విడుదల జరుగుతుందని భావించారు. అయితే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కమిషనర్లతో సదస్సులు నిర్వహించి సరైన ప్రణాళికలను రూపొందించాలని కోరాయి. దీంతో మళ్లీ సర్వే జరిపి తొలి విడతలో ఎన్ని మురికివాడలను అభివృద్ధి చేయాలో అందుకు ఎన్ని నిధులు కావాలన్న దానిపై ప్రతిపాదనలు తయారుచేసి కేంద్ర ప్రభుత్వానికి పంపారు. తొలి విడతగా నెల్లూరు నగరానికి 55 కోట్ల రూపాయలు కేటాయించారు. ఈ నిధులతో తాగునీరు సరఫరా, రోడ్ల నిర్మాణం, డ్రైనేజి కాల్వల నిర్మాణం తదితర పనులు చేపడతారు.

# మనీ సర్క్యులేషన్ స్కీం డొంక పెద్దది!

## రైసుమిల్లర్లకు డబ్బులిచ్చిన షుగర్ డాక్టర్

మనీ సర్క్యులేషన్ స్కీం వ్యవహారంలో అధికారులు విచారణ జరిపేకొద్దీ మరిన్ని విషయాలు బయట పడుతున్నాయి. పొగతోటలోగల ఒక డాక్టర్ కోట్లాది రూపాయలు మనీ సర్క్యులేషన్ స్కీం క్రింద వసూలు చేసిన వ్యవహారంలో తీగలాగితే డొంక కదులుతున్నదట. డాక్టర్ నిర్వహించే హాస్పిటల్ కేంద్రంగా సాగిన నగదు వసూళ్లలో నగరానికి చెందిన పలువురు రైస్‌మిల్లర్లు, వ్యాపారులు, డాక్టర్లు, లాయర్లు తమ వంతు పాత్ర పోషించడంపై తీవ్రమైన చర్చ జరుగుతోంది. స్టోన్‌హౌస్‌పేట ప్రాంతంలో వ్యాపారం జరగక గత కొంత కాలంగా మూసేసి ఉన్న రైస్‌మిల్లులు తిరిగి తెరుచుకోవడం వెనుక మనీ సర్క్యులేషన్ స్కీం సొమ్ము ఉందన్న వార్తలు వినవస్తున్నాయి. తీవ్ర నష్టాల్లో ఉండి మిల్లులు నిర్వహించకుండా ఉండిన కొందరు గత కొంతకాలంగా చేతినిండా డబ్బుతో ఆర్థికంగా బలోపేతులై రైస్‌మిల్లులు తిరిగి తెరవడం వెనుక ఈ డబ్బు ఉన్నట్లు సమాచారం. భక్తవత్సలనగర్‌కు చెందిన ఒక న్యాయవాది, పట్టణంలో పేరుమోసిన డాక్టర్ల హస్తం ఈ మనీ సర్క్యులేషన్ స్కీం వ్యవహారంలో ఉన్నట్లు వార్తలొస్తున్నాయి. షుగర్ డాక్టర్‌ను విచారించిన సిబిసిఐడి అధికారులు ఈ సమాచారం సేకరించాడట. మరోవైపు ఈ ముఠా చెన్నై, బెంగుళూరు నగరాల్లోనూ పెద్ద ఎత్తున రియల్ ఎస్టేట్ వ్యాపారం, కన్‌స్ట్రక్షన్ రంగాలలో దిగడం వెనుక కోట్లాది రూపాయల మనీ సర్క్యులేషన్ స్కీం సొమ్ము ఉన్నట్లు తెలుస్తోంది.

# పోలీసులకు సవాల్ విసురుతున్న దొంగలు!

## నెల్లూరులో ఆగని దొంగతనాలు



నెల్లూరు నగరంలో రోజురోజుకు చోరీలు పెరిగి పోతున్నాయి. నగరంలో ప్రధాన కూడళ్లలో పోలీసు నిఘా ఏర్పాటు చేస్తామని ఎస్పీ చేసిన ప్రకటన కేవలం కాగితాలకే పరిమితమై పోయింది. ఒంటరిగా నడిచి వెళ్తున్న మహిళల మెడలో సరుడులను అపహరించడం దగ్గర్నుంచి ఇంటి తాళాలను పగులగొట్టి నగదు, బంగారాన్ని దోచుకెళ్తున్నారు. నగరంలో ప్రతిరోజూ ఏదో ఒక ప్రాంతంలో చోరీలకు పాల్పడుతున్నారు అగంతకులు. పోలీసులకు చోరీల సవాల్‌గా మారుతున్నా నిందితులను మాత్రం గుర్తించి పట్టుకోలేక పోతున్నారన్న విమర్శలు ఉన్నాయి. నగర ప్రజలకు కంటి మీద కునుకు లేకుండా పోతుంది. వివిధ అవసరాల నిమిత్తం ఒంటరిగా బజారుకు వెళ్లి రావాలంటేనే మహిళలు భయపడుతున్నారు. గత వారంలో కాపువీధిలో ఉన్న జైన్ దేవాలయంలోని హుండీని పగులగొట్టి దాదాపు ఐదు లక్షల రూపాయలకు పైగా నగదు దోచుకెళ్లారు. మండపాల వీధిలోని మరో నగలు తయారు చేసే దుకాణంలో తలుపులు పగులగొట్టి కొంత బంగారం తీసుకెళ్లారు. నగరంలో గతవారం ఏడు ఇళ్లు దోపిడీకి గురయ్యాయి. సంబంధిత పోలీస్‌స్టేషన్లలో బాధితులు ఫిర్యాదులు చేస్తున్నప్పటికీ సరైన విధంగా స్పందించకుండా కాలయాపన చేస్తున్నారు. ఇప్పటికైనా జిల్లా ఎస్పీ స్పందించి నిఘాను మరింత పటిష్టం చేయడంతోపాటు చోరీలకు పాల్పడుతున్న వారిని అరెస్టు చేసేందుకు కృషి చేయాల్సి ఉంది.



# రంగనాథ స్వామి రథోత్సవం 10న!

నెల్లూరీయుల ఆరాధ్యదైవం తల్పగిరి రంగనాథస్వామి బ్రహ్మోత్సవాలు 3వ తేదీ ప్రారంభమయ్యాయి. 10వ తేదీ రథోత్సవం, రాత్రికి పొన్న వాహనోత్సవ సేవ, 11వ తేదీ అశ్వవాహన సేవ, 12వ తేదీ ప్రణయకలహోత్సవం, 13వ తేదీ పుష్పయాగం, 14వ తేదీ తెప్పోత్సవం జరుగుతాయి. భక్తులను ఈ కార్యక్రమాలకు విచ్చేసి తీర్థ ప్రసాదాలు స్వీకరించి జయప్రదం చేయమంటున్నారు ఆలయ ఛైర్మన్ ప్రత్తి రవీంద్రబాబు.

# డి వార్మింగ్ మాత్రల పంపిణీకి బ్రేక్!

## ఒంటిపూట బడే సమస్య

జిల్లావ్యాప్తంగా ఈ నెల ఒకటవ తేదీ నుంచి పంపిణీ చేయాల్సిన డి వార్మింగ్(నులిపురుగుల) మాత్రల కార్యక్రమానికి బ్రేక్ పడింది. అన్ని పాఠశాలల విద్యార్థులకు మాత్రలను పంపిణీ చేయాలని ఆదేశించిన వైద్య, ఆరోగ్య శాఖాధికారులు ఆ తర్వాత పంపిణీ కార్యక్రమాన్ని మార్చి 15వ తేదీకి వాయిదా వేస్తున్నట్లు ప్రకటించారు. ఇప్పటికే సరఫరా చేసిన మాత్రలను ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్లో భద్రపరచాలని ఆదేశాలు జారీ చేశారు. పాఠశాలల్లో చదువుతున్న ఐదు సంవత్సరాలలోపు వారికి ఒక మాత్రను భోజనం చేసిన గంట తర్వాత వేసి ఉపాధ్యాయుల పర్యవేక్షణలో ఉంచుకోవాలి. ఈ నెల 15వ తేదీ నుంచి జిల్లాలో ఒంటి పూట బడులు జరుగుతాయి. ఈ సమయంలో విద్యార్థులకు డి వార్మింగ్ మాత్రలు వేసి ఉపాధ్యాయుల పర్యవేక్షణలో ఉంచుకోవడం కష్టతరమని కొందరు వ్యాఖ్యానిస్తున్నారు. ఒంటి పూట బడి పూర్తికాగానే ఉపాధ్యాయులు బడిమూసివేసి ఇంటికి వెళ్లిపోతారు. పిల్లలకు మాత్రలు వేసిన అనంతరం ఒక గంట వారి పర్యవేక్షణలో ఉంచాలి. వైద్య, ఆరోగ్య శాఖ అధికారులు తీసుకున్న నిర్ణయంతో ఉపాధ్యాయులు పాఠశాల సమయం ముగిసిన తర్వాత మరోగంట వేచి చూడాల్సి వస్తుంది. ఇది ఏ మేరకు అమలవుతుందో వేచి చూడక తప్పదు.

## ● కోవూరు ఉప ఎన్నికల్లో
## వైఎస్ఆర్ పార్టీదే విజయం!

### గూడూరు వైకాపా నేతలు

దివంగత వైఎస్ రాజశేఖర్‌రెడ్డి పేరును సిబిఐ ఎఫ్ఐఆర్‌లో చేర్చడాన్ని నిరసిస్తూ పార్లమెంటు సభ్యత్వాన్ని తృణప్రాయంగా వదులుకొన్న వ్యక్తి మేకపాటి రాజమోహన్‌రెడ్డి అని గూడూరు వైఎస్ఆర్ పార్టీ నేతలు కొనియాడారు. గూడూరు పట్టణంలో జరిగిన విలేకరుల సమావేశంలో మున్సిపల్ మాజీ చైర్మన్ పాశం సునీల్‌కుమార్, మండల కన్వీనర్ మల్లు విజయకుమార్‌రెడ్డి మాట్లాడుతూ కోవూరు ఉప ఎన్నికలలో నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి విజయం సాధిస్తారన్న ధీమా వ్యక్తం చేశారు. ఆయన విజయాన్ని ఎవ్వరూ అడ్డుకోలేరన్నారు. తెలుగుదేశం, కాంగ్రెస్‌పార్టీలు ఎన్ని కుయుక్తులు పన్నినా ప్రజలు వైఎస్ జగన్ పక్షాన వున్నారని తెలిపారు. ఇచ్చిన మాటకు కట్టుబడి పార్లమెంటు సభ్యత్వాన్ని వదులుకొన్న మేకపాటి రాజమోహన్‌రెడ్డి తిరిగి నెల్లూరు స్థానం నుంచి అత్యధిక మెజార్జీతో గెలవడం తథ్యమన్నారు. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి చేపట్టిన ప్రజాకర్షక పథకాలను జనం మరవలేదని, వారి గుండెల్లో ఆయన్ను ఆరాధిస్తున్నారన్నారు.

## రాష్ట్రంలో రాక్షస రాజ్యం సాగుతోంది



కడప ఎమ్పీ వైఎస్ జగన్మోహన్‌రెడ్డి.

రాష్ట్రంలో రాక్షసరాజ్యం కొనసాగుతోందని ప్రజల బాధలు పట్టించుకొనే వారే లేకుండా పోయారని వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ అధ్యక్షుడు వైఎస్ జగన్మోహన్‌రెడ్డి విమర్శించారు. కోవూరు ఉప ఎన్నికలలో తమ పార్టీ తరపున పోటీ చేస్తున్న నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డికి మద్దత్తుగా ప్రచారం నిర్వహించేందుకు విచ్చేసిన ఆయన రైలులో కావలికి వచ్చారు. మొదటగా కడనూతలలో గల ఆర్ ఎస్ఆర్ ఇంజనీరింగ్ కాలేజి వద్దకు చేరుకొని విద్యార్థులనుద్దేశించి ప్రసంగించారు. వైఎస్ ఆర్ పార్టీ అధికారంలోకి రాగానే ఫీజు రీఎంబర్స్‌మెంటు బకాయిలన్నీ విడుదల చేస్తామన్నారు. అనంతరం కొడవలూరు మండలంలో పలు ప్రాంతాలలో విస్తృత ప్రచారం చేపట్టారు. చంద్రబాబునాయుడు, కాంగ్రెస్‌పార్టీ కుమ్మక్కై మూడోపార్టీని అధికారంలోకి రాకుండా కుయుక్తులు పన్నుతున్నాయన్నారు. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి పాలన రాష్ట్రంలో రామరాజ్యాన్ని తలపించగా, నేడు రాక్షసరాజ్యం కొనసాగుతోందని విమర్శించారు. వైఎస్‌పై అభిమానంతో ఎందరో ఎమ్మెల్యేలు, ఎమ్పీలు తమ పదవులు త్యజించారని వారు చేసిన త్యాగం వెలకట్టలేనిదన్నారు. కోవూరు నుంచి వైఎస్ఆర్ పార్టీ అభ్యర్థిగా వున్న ప్రసన్నకుమార్‌రెడ్డిని గెలిపించాలని, ఫ్యాను గుర్తుకు ఓటు వేయాలని ఓటర్లను కోరారు. ఫ్యాను దాటికి టిడిపి, కాంగ్రెస్ పార్టీలు కొట్టుకుపోతాయని ప్రసన్నకుమార్‌రెడ్డి అన్నారు. ఈ పర్యటనలో ఆ పార్టీ కన్వీనర్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి, మాజీ ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి, రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి, శ్రీధర్‌రెడ్డి, అనిల్‌కుమార్ యాదవ్ తదితరులు పాల్గొన్నారు.



ఎన్నికల ప్రచారంలో నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి, కాకాణి గోవర్ధన్‌రెడ్డి.

## సోమిరెడ్డికి మరో ఓటమి తథ్యం!

కోవూరు ఉప ఎన్నికల్లో తెలుగుదేశంపార్టీ తరపున పోటీ చేస్తున్న సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డికి ఓటమి తప్పదని వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ అభ్యర్థి నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి జోస్యం చెప్పారు. విడవలూరు మండలం అలగానిపాడులో ప్రచారం చేపట్టిన ప్రసన్న సోమిరెడ్డిని లక్ష్యంగా చేసుకొని విమర్శలు గుప్పించాడు. ఈ ఎన్నికల్లో ఓటమి తప్పదన్న సంగతి చంద్రమోహన్‌రెడ్డికి తెలుసని, ఆయన కేవలం కలెక్షన్ల కోసమే నామినేషన్ వేశాడని ఆరోపించారు. ఎన్‌టిఆర్ చిత్రపటాన్ని నెల్లూరు నడిరోడ్డులో కాలుక్రింద వేసి తొక్కిన సంగతి ప్రజలు ఇప్పటికీ మరవలేదన్నారు. అలాంటి సోమిరెడ్డికి తమపై విమర్శలు చేసే అర్హత లేదని, నోరు అదుపులో పెట్టుకోవాలన్నారు. తనపై ఎంత బురద చల్లినా, ఎన్ని కుయుక్తులు పన్నినా నియోజకవర్గ ప్రజలు తనపై చూపే అభిమానాన్ని ఎవరూ చెడగొట్టలేరన్నారు. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి పేద ప్రజలకు చేసిన సేవలను మరువలేరన్నారు. తనకు వేసే ప్రతి ఓటు వైఎస్ఆర్‌కు వేసినట్లేనన్నారు.

## కోవూరు ప్రజలు నావైపే నిలబడతారు!

నెల్లూరు జిల్లాలోని రాజకీయ కుటుంబాలలో 'నల్లపరెడ్డి' కుటుంబం చాలా ప్రముఖమైంది. స్వర్గీయ నల్లపరెడ్డి చంద్రశేఖర్‌రెడ్డి, నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డిల ద్వయం ప్రజాప్రతినిధులకు పర్యాయపదంగా వెలుగొందడమే కాకుండా ప్రజానేతలుగా పేరు తెచ్చుకొన్నారు. నల్లపురెడ్డి శ్రీనివాసులురెడ్డి పెద్దకుమారుడే ప్రసన్నకుమార్‌రెడ్డి. 1993లో తండ్రి నల్లపురెడ్డి శ్రీనివాసులరెడ్డి మరణం తర్వాత కోవూరులో జరిగిన ఉప ఎన్నికల్లో తొలిసారి పోటీచేసిన ప్రసన్నకుమార్‌రెడ్డి ఇప్పటి ఉప ఎన్నికలతో కలుపుకొంటే ఆరోసారి కోవూరు నుంచి పోటీచేస్తున్నారు. నాలుగుసార్లు కోవూరు ఎమ్మెల్యేగా ఎన్నికై అరుదైన రికార్డును ప్రసన్న సాధించారు. ఎన్టీరామారావు మంత్రి వర్గంలో కొంతకాలం చక్కెర మంత్రిగా పని చేశారాయన. తండ్రి మాదిరిగానే ప్రసన్నకు ఓపిగ్గా ప్రజాసమస్యలు తెలుసుకోవడం, వారితో మమేకమవడం అంటే ఇష్టం. ద్వితీయ శ్రేణి నేతలను గౌరవించడం, సముచితస్థానం కల్పించడం, కార్యకర్తలను అక్కున చేర్చుకోవడం ఈయన ప్రత్యేకత. ఆపదలో వున్న వారిని ఆదుకోవడం, సహాయం కోరి వచ్చిన వారికి ఎవరికీ లేదని చెప్పక పోవడం ఈయన బలహీనత. ఉప ఎన్నికలను పురస్కరించుకొని 'జమీన్‌రైతు' విలేఖరితో ఆయన మాట్లాడుతూ నల్లపరెడ్డి కుటుంబానికి కోవూరు నియోజకవర్గం కంచుకోటని, ఇక్కడి ఓటర్లు తన దేవుళ్లని వాఖ్యానించారు. స్వర్గీయ వైఎస్ రాజశేఖర్‌రెడ్డి చేపట్టిన సంక్షేమ పథకాలకు ప్రజల్లో వున్న ఆదరణ, వైఎస్ జగన్మోహన్‌రెడ్డిపై ఉన్న అభిమానంతో తప్పకుండా మంచి మెజార్టీతో గెలుస్తానని చెప్పారు. ఆయనతో ఇంటర్వ్యూ ఇలా సాగింది.

***ప్రశ్న : ఎమ్మెల్యేగా ఎందుకు రాజీనామా చేశారు?***

**జవాబు :** వైఎస్ రాజశేఖర్‌రెడ్డి చేస్తుండిన అభివృద్ధి కార్యక్రమాలు చూసి ఆయనకు దగ్గరయ్యాను. ఆయన మరణాంతరం సిబిఐ ఎఫ్ఐఆర్‌లో ఆయన పేరు చేర్చడంతో మనస్తాపం చెంది ఎమ్మెల్యే పదవికి రాజీనామా చేశా. నా రాజీనామాను స్పీకర్ ఆమోదించడంతో ఉప ఎన్నికలు జరుగుతున్నాయి. వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ తరుపున ఈ ఎన్నికల్లో పోటీ చేయమని జగన్ నన్ను ఆశీర్వదించి పంపారు. అందుకే పోటీకి దిగా.

***ప్రశ్న : ఈ మూడేళ్లలో మీరు చేసిన అభివృద్ధి కార్యక్రమాలు ఏమిటీ?***

**జవాబు :** 2000లో జరిగిన ఎన్నికల్లో గెలిచినా ప్రతిపక్షంలో ఉండడం వల్ల నియోజకవర్గ పరిధిలో వివిధ అభివృద్ధి పనులకు గాను నిధులు మంజూరు చేయించను ఇబ్బంది పడాల్సి వచ్చింది. అయినా వెరవక ఇందుకూరుపేట మండలంలో 30ఏళ్లుగా మరమ్మత్తులకు నోచుకోని బూదవాగు డ్రైయిన్ అభివృద్ధికి 50 లక్షల నిధులు సాధించాను. దీంతో ఎనిమిది గ్రామాలకు ముంపు బాధ తప్పింది. 6వేల ఎకరాలకు మేలు జరిగింది. సిపిడబ్ల్యూ మంచినీటి పథకం క్రింద ఇందుకూరుపేట మండలానికి 1.50 కోట్ల రూపాయలు, బుచ్చిరెడ్డిపాళెం మండలానికి 2.50కోట్ల రూపాయలు మంజూరు చేయించాను. పల్లిపాడు నుంచి కుడితిపాళెం వరకు తారురోడ్డు నిర్మాణానికి కోటి రూపాయలు, కొత్తూరు నుంచి చెల్లాయగారి తోపు రోడ్డు నిర్మాణానికి నాబార్డు నిధులు 65లక్షల రూపాయలు మంజూరు చేయించాను. కొత్తూరు, ఇందుకూరుపేట గ్రామాల్లో సిమెంటు రోడ్డు నిర్మాణానికి 38లక్షల రూపాయలు మంజూరు చేయించాను. చాముండేశ్వరి దేవి ఆలయ కోనేరు అభివృద్ధికి 25లక్షల రూపాయలు మంజూరు చేయించి పనులు పూర్తి చేయించారు. నెల్లూరు ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి సహకారంతో కోవూరు నియోజకవర్గంలో 1.75 కోట్ల రూపాయలతో సిమెంటురోడ్లు వేయించి మూడు కమ్యూనిటీ హాళ్లు కట్టించాను. 1.50కోట్ల రూపాయల ఎమ్మెల్యే నిధులతో రోడ్లు, మంచినీటి పథకాలు ఏర్పాటు చేయించారు. బుచ్చిరెడ్డిపాళెంలో 60 లక్షల రూపాయలతో సిమెంటురోడ్డు, ఇనుమడుగు – ముదివర్తి రోడ్డు నిర్మాణానికి 60 లక్షల రూపాయలు, అన్నారెడ్డిపాళెం – అలగానిపాడు రోడ్డు నిర్మాణానికి 46లక్షల రూపాయలు మంజూరు చేయించాను. ఈ జాబితాలో ఇస్కపాళెం, కొత్తవంగల్లు, కాగులపాడు, పాటూరు రోడ్లు వున్నాయి.

***ప్రశ్న : కోవూరులో మీరేలా గెలుస్తారు?***

**జవాబు :** స్వర్గీయ వైఎస్ రాజశేఖర్‌రెడ్డి చేపట్టిన సంక్షేమ కార్యక్రమాలు ప్రజల మనసులో చిరస్థాయిగా నిలిచిపోయాయి. అవే నా గెలుపుకు శ్రీరామరక్ష. అన్ని వర్గాల ప్రజలు వైఎస్ జగన్మోహన్‌రెడ్డిని ఆశీర్వదిస్తున్నారు. కోవూరు ప్రజలు నల్లపరెడ్డి కుటుంబ అభిమానులు. నా పాలిట దేముళ్లు. ఎప్పుడూ ఆదరిస్తూనే వున్నారు. ఈ ఆదరణతోనే ఈసారి ఎన్నికల్లోనూ గెలుస్తాను.



***ప్రశ్న : మీ ప్రచారం ఎలా సాగుతోంది?***

**జవాబు :** వైఎస్ జగన్మోహన్‌రెడ్డి నియోజకవర్గంలో జరిపిన ప్రచారానికి అనూహ్య స్పందన లభించింది. ప్రతి గ్రామంలోనూ ప్రజలు అప్యాయత, అనురాగాలతో ఆయనకు స్వాగతం పలికారు. ఓటు చేస్తామన్న హామీ కూడా ఇచ్చారు. ఇంతకు ముందు ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి, జడ్పీ మాజీచైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి చేసిన ప్రచారానికి మంచి స్పందన లభించింది.

***ప్రశ్న : ఈసారి మీ ఓటు బ్యాంకు ఏమిటీ?***

**జవాబు :** స్వర్గీయ వైఎస్ రాజశేఖర్‌రెడ్డి, ఆయన కుమారుడు జగన్మోహన్ రెడ్డి. ప్రజలకు వైఎస్ చేసిన మేళ్లు. ఆరోగ్యశ్రీ, పెన్షన్లు, ఫీజు రీఎంబర్స్‌మెంట్, రైతులకు ఉచిత విద్యుత్, రుణమాఫీ పథకాలతో లబ్దిపొందిన వారంతా నాకు ఓటు వేస్తారు.



వెంకటగిరిలో గాయకుడు ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం దంపతులను సాంస్కృతిక ఐక్యవేదిక తరఫున సన్మానిస్తున్న సాయికృష్ణ యాచేంద్ర తదితరులు.

# మునిసిపల్ కార్యాలయంలో సేవా కేంద్రం!

● వినియోగించుకోమంటున్న గూడూరు సబ్‌కలెక్టర్

గూడూరు పట్టణ ప్రజల సౌకర్యం కోసం మునిసిపాలిటీ కార్యాలయంలో ఆన్‌లైన్ సేవా కేంద్రాన్ని ఏర్పాటు చేస్తున్నట్లు సబ్ కలెక్టర్ వీరపాండ్యన్ తెలిపారు. ఈ కేంద్రం ఏర్పాటుపై ఆయన మునిసిపల్ అధికారులతో సమీక్షించారు. ఆయన మాట్లాడుతూ పట్టణ ప్రజలు వివిధ సమస్యలపై కార్యాలయాలలో అధికారుల చుట్టూ తిరగకుండా తమ సమస్యలు తెలిపి వినతి పత్రాన్ని ఇక్కడ అందిస్తే ఆ సమస్య నిర్ణీత సమయంలో పరిష్కరింపబడుతుందన్నారు. ఇలాంటి కేంద్రాలను రాష్ట్రంలో వివిధ ప్రాంతాలలో ప్రయోగాత్మకంగా ఏర్పాటు చేస్తున్నారని వాటిలో గూడూరులో ఏర్పాటు చేయనున్న కేంద్రం ఒకటన్నారు. అనంతరం ఆయన పట్టణంలో పారిశుధ్య పరిస్థితులను, పార్కులను, పాఠశాలలను తనిఖీ చేసి అక్కడ పరిస్థితులను గమనించారు. దోమలు, కుక్కల బెడద అధికంగా వుండడాన్ని గుర్తించిన ఆయన దీనికోసం ప్రత్యేక చర్యలు చేపడుతామన్నారు. సబ్‌కలెక్టర్ వెంట మునిసిపల్ కమిషనర్ సీతారామరావు, అధికారులు ఉమామహేశ్వరరావు, కామేశ్వరరావు, స్వర్ణకుమార్ తదితరులు పాల్గొన్నారు.

# నేలటూరు నిర్వాసితుల ఆందోళన!

నేలటూరు ప్రాంతంలో నిర్మితమవుతున్న ఎపిజెన్‌కో థర్మల్ విద్యుత్ కేంద్రం కారణంగా సర్వం కోల్పోయిన తమకు మౌలిక వసతులు కల్పించాలని నిర్వాసితులు డిమాండ్ చేశారు. ప్రాజెక్టు వద్దకు చేరుకున్న నిర్వాసితులు

### ఆదుకోమని వినతి

అధికారులు స్థల సేకరణ సమయంలో లేనిపోని హామీలిచ్చి చివరికొచ్చేసరికి మోసం చేశారని, తమ బాగోగులు పట్టించుకోకుండా గాలికి వదిలేశారని విమర్శించారు. కమిటీ నేత కృష్ణయ్య మాట్లాడుతూ ఇదిగో అదిగో అంటూ కాలయాపన చేస్తూ జెన్‌కో అధికారులు నిర్వాసితులను మోసం చేస్తున్నారన్నారు. విద్య, వైద్యం, ఉపాధి రంగాల్లో నిర్వాసితులను పట్టించుకోవడం లేదని, ఆర్‌అండ్‌ఆర్ కాలనీలో మౌలిక వసతులు కల్పించలేదన్నారు. డ్రైనేజి కాలువలు ఏర్పాటు చేయాలని, రోడ్డు సౌకర్యం కల్పించాలని, ప్రతి కుటుంబానికి లక్షయాభై వేల రూపాయలను అదనపు పరిహారంగా చెల్లించాలని, స్మశాన స్థలానికి ప్రహరీగోడ నిర్మించాలని డిమాండ్ చేశారు. తమ డిమాండ్లను సత్వరం పరిష్కరించకపోతే థర్మల్ ప్రాజెక్టు పనులను అడ్డుకుంటామని హెచ్చరించారు.

# ఎమ్పీ మనవడినంటూ టోకరా!

ఎమ్పీ మనవడినంటూ మాజీ ప్రజాప్రతినిధిని మోసం చేసిన ఇంజినీరింగ్ విద్యార్థి గుట్టు రట్టయ్యింది కావలిలో. ఇటీవల ఒక వ్యక్తి తాను ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి కొడుకు గౌతంరెడ్డినని చెప్పి పట్టణంలో గల మాజీ ఎంపిపి కృష్ణారెడ్డికి ఫోన్ చేసి తమ అబ్బాయి పనిమీద కావలి వచ్చాడని, అర్జెంటుగా 30వేల రూపాయలు ఇస్తే తర్వాత ఇస్తానని చెప్పడంతో అది నిజమే ననుకొన్న ఆ నేత అబ్బాయిని ఇంటికి పంపిచమని చెప్పాడట. కొంతసేపటికి ఇంజినీరింగ్ చదివే ఒక విద్యార్థి తన స్నేహితులను వెంటబెట్టుకొని వెళ్లి ఆ సొమ్ము తీసుకొన్నాడట. తిరిగి మరోసారి ఆ మాజీ ప్రజాప్రతినిధి ఊర్లోలేని సమయంలో అలాంటి ఫోన్ వచ్చిందట. మా అబ్బాయి కావలిలో వున్నాడు కారు చెడిపోయింది. మీ కారు ఇస్తే రెండు గంటలలో తిరిగి ఇచ్చేస్తాడని నమ్మబలికాడట. ఆ మాటలు నమ్మిన ఆయన ఇంటికి ఫోన్ చేసి ఆ విద్యార్థి వస్తే కారు ఇమ్మని కుటుంబ సభ్యులకు తెలిపాడట. అదే సమయంలో ఉదయగిరి శాసనసభ్యుడు

### తెలివిమీరిన కావలి విద్యార్థి

మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి ఆ నేతకు తారసపడడంతో ఈ సంగతి చెప్పాడట. ఆ మాటలు విన్న శేఖర్‌రెడ్డి గౌతంరెడ్డికి అంత పెద్ద పిల్లాడే లేడని, ఎవరో మోసం చేశారని చెప్పడంతో తేరుకున్న ఆయన కావలి పోలీసులకు ఫిర్యాదు చేయడంతో వారు ఆ విద్యార్థిని అదుపులోకి తీసుకున్నారు. ఎమ్పీ మనవడినంటూ మోసం చేసిన ఆ విద్యార్థి సైతం శ్రీనివాసులురెడ్డి అనే రాజకీయ నాయకుడి కుమారుడు కావడంతో పోలీసులు కేసు నమోదు చేయకుండా రాజీ చేశారట. అందుకు పోలీసులకు పెద్ద మొత్తంలో నగదు అందినట్లు గగ్గోలురేగుతోంది. గతంలోనూ ఈ వ్యక్తి పలువురిని ఇలాగే మోసగించినట్లు తెలుస్తోంది.

# ప్రతి రైల్వే స్టేషన్‌లో సమస్యలే?

### పట్టించుకోని రైల్వే అధికారులు

సౌత్ సెంట్రల్ రైల్వే పరిధిలోగల పలు స్టేషన్లలో ప్రయాణీకులు కనీస సౌకర్యాలకు నోచుకోవడం లేదు. ప్లాట్‌ఫాం సరిగాలేక, వాటి బాగోగులు పట్టించుకోకపోతుండడంతో వివిధ స్టేషన్లల్లో అపరిశుభ్రత తాండవిస్తోంది. చాలాచోట్ల విరిగిన బల్లలు, తిరగని ఫ్యాన్లు, అపరిశుభ్రంగా వున్న మంచినీటి కొళాయిలే కన్పడుతుంటాయి. ఫ్లాట్‌ఫాం దెబ్బతిని వుంటుండడంతో ప్రయాణీకులు రైలు ఎక్కేటప్పుడు, దిగేటప్పుడు ప్రమాదాలకు గురౌతున్న సందర్భాలు అనేకం. మరోవైపు సూపర్‌ఫాస్టు ఎక్స్‌ప్రెస్ రైళ్లను ఆయా స్టేషన్లలో నిముషం పాటే నిలుపుతారు. ఈ వ్యవధిలోనే రాకపోకలు సాగించాల్సి రావడం, ఆ సమయంలో ఫ్లాట్‌ఫాంలపై పడిపోయి తీవ్ర గాయాలపాలవుతున్నారు. దీనిని దృష్టిలో వుంచుకొని కావలి నుంచి చెన్నై వరకు, ఇటు తిరుపతి వరకు వున్న రైల్వే స్టేషన్లలో ప్రయాణీకులకు కనీస సౌకర్యాలు కల్పించాలని, ఫ్లాట్‌ఫాంలు ఎత్తు పెంచాలని, అసాంఘిక శక్తుల ఆగడాలను అరికట్టాలని, పోలీస్ బందోబస్తు పెంచాలని పలువురు ప్రయాణీకులు, స్వచ్ఛంద సంస్థలు డిమాండ్ చేస్తున్నాయి.

# సమస్యల పరిష్కారానికి బీద చేయూత!

బోగోలు పంచాయితీ పరిధిలోగల ముస్లిం వీధిలో గత కొన్నేళ్లుగా తిష్టవేసి వున్న సమస్యల పరిష్కారానికి నడుంబిగించారు ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు. ముస్లిం కుటుంబాలు కాపురం వుంటున్న ఈ ప్రాంతంలో సైడు కాలువలు, సిమెంటురోడ్లు లేక చాలా కాలంగా ప్రజలు అవస్థలు పడుతున్నారు. వీటిపై పలుమార్లు అధికారులకు తెలియజేసినా ఫలితం లేకుండా వుండింది. ఈ పరిస్థితుల్లో ఇటీవల ఇక్కడకు వచ్చిన శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు దృష్టికి ఆ ప్రాంత సమస్యలను తీసుకుపోయారు స్థానికులు. దానికి స్పందించిన బీద ఆయా ప్రాంతాలను సందర్శించి పరిశీలించిన అనంతరం సిమెంటు రోడ్డు, సైడు కాలువలు ఏర్పాటుకు నిధులు మంజూరు చేయడమేకాక త్వరితగతిన వీటిని పూర్తి చేయాలని ఆదేశాలు జారీ చేశారు. స్థానిక ఇట బాషా, స్పెషల్ ఆఫీసర్ పరంధామయ్య కృషితో ముస్లింవీధి బాగుపడడంతో పలువురు అభినందిస్తున్నారు.

# బీద మస్తాన్‌రావును విమర్శించడమా?

### మండిపడ్డ పార్టీ శ్రేణులు

మునిసిపల్ స్థలాల కబ్జాకు పాల్పడే కాంగ్రెస్‌పార్టీ నేతలకు ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావును విమర్శించే అర్హత లేదని తెలుగుదేశంపార్టీ విమర్శించింది. కావలిలో ఇటీవల ఏర్పాటు చేసిన విలేకరుల సమావేశంలో మాజీ కౌన్సిలర్ బ్రహ్మయ్య, సర్దార్ తదితరులు కాంగ్రెస్ నేతలపై మండిపడ్డారు. సొంతనిధులు వెచ్చించి ప్రజోపయోగ కార్యక్రమాలు చేపడుతూ, నిజాయితీగా రాజకీయాల్లో వున్న వ్యక్తి మస్తాన్‌రావు అని తెలిపారు. అలాంటి వ్యక్తిపై ప్రజలకున్న అభిమానాన్ని చూసి తట్టుకోలేక కాంగ్రెస్ నేతలు ఇష్టానుసారంగా తప్పుడు ఆరోపణలు చేస్తే ఊరుకోమన్నారు. గత 25ఏళ్లుగా పరిష్కారం కాని ఎన్నో సమస్యలు బీద మస్తాన్‌రావు శాసనసభ్యుడైన తర్వాత పరిష్కరింపబడ్డాయని తెలిపారు. గతంలో కావలి పట్టణంలో ఏ శాసనసభ్యుడు చేయని విధంగా అభివృద్ధి పనులు చేస్తుంటే ఓర్వలేక కాంగ్రెస్ పార్టీ వారు కుయుక్తులు పన్నుతూ పనులు జరగకుండా ఆటంకం కల్పిస్తున్నారని, అలాంటి వారికి ఆయన్ను విమర్శించే అర్హత లేదన్నారు. దీనిపై ధైర్యం వుంటే బహిరంగ చర్చకు రావాలని సవాల్ విసిరారు.

# కొడవలూరులో ఆటోల దూకుడు

కొడవలూరు మండలంలో ఆటోలు మితిమీరిన వేగంతో ప్రయాణిస్తున్నా వాటిని అదుపు చేసే వారే లేకుండా పోయారు. కొడవలూరు, అల్లూరు, విడవలూరు వెళ్లేందుకు కూడలి అయిన ఈ ప్రాంతంలో ప్రజలు అధికంగా

### హడలిపోతున్న జనం

ఆటోలనే ఆశ్రయిస్తుంటారు. బస్సులు సకాలంలో రాకపోవడంతో, ఇతరత్రా కారణాల వలన నిత్యం తిరిగే ఆటోలపైనే ఆధారపడుతుంటారు. ప్రయాణీకులను అధికంగా ఎక్కించుకొని మితిమీరిన వేగంతో ప్రయాణిస్తుండడం వలన తరచూ ప్రమాదాలు చోటు చేసుకొంటున్నాయి. ఆటోలను నియంత్రించాల్సిన పోలీస్, రవాణాశాఖ అధికారులు దాని గురించే పట్టించుకోకపోవడంతో ఇష్టానుసారంగా తిరుగుతున్నాయి ఆటోలు. మరీ ముఖ్యంగా చిన్న పిల్లలు, తగిన వయసు లేకుండా ఆటోలను నడుపుతుండడంతో ప్రయాణీకులకు భద్రత లేకుండా పోతోంది. ఇటీవల ఈ మార్గంలో విపరీతమైన వేగంతో వెళ్తున్న ఆటో ఆగివున్న ట్రాక్టర్‌ను ఢీకొనడంతో అందులో ప్రయాణిస్తున్న వారు తీవ్ర గాయాలపాలయ్యారు. ఇలాంటి ఘటనలు నిత్యం ఎక్కడోఒక చోట జరుగుతూనే వున్నా అధికారులు పట్టించుకోకపోవడం పట్ల విమర్శలు వ్యక్తం అవుతున్నాయి.



కోవూరు ఎమ్మార్వో కార్యాలయంలో అసిస్టెంట్ రిటర్నింగ్ ఆఫీసర్లతో మాట్లాడుతున్న ఎన్నికల సంఘం పరిశీలకుడు డి.ఎన్.గుప్త. ప్రక్కన కలెక్టర్, కోవూరు రిటర్నింగ్ ఆఫీసర్.



ఎలక్ట్రానిక్ ఓటింగ్ మిషన్ల పనితీరును పోలింగ్ ఆఫీసర్లకు వివరిస్తున్న అదనపు జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతం.

# కోదండరామాలయంలో ధ్వజస్తంభ ప్రతిష్ఠ

బోగోలు మండలం కోవూరుపల్లి పంచాయితీలో గల కోదండరామస్వామి ఆలయంలో ధ్వజ స్తంభ ప్రతిష్టాపన మహోత్సవం సాంప్రదాయబద్ధంగా జరిగింది. మూడురోజులపాటు ప్రత్యేక పూజలు, హోమాలు నిర్వహించిన అనంతరం వేదపండితులు ఆలయాన్ని ప్రతి ష్టాపనకు సిద్ధం చేశారు. వైఖాసనాగమ పండితులు అనంత

## కోవూరుపల్లిలో వేడుకగా జరిగిన కార్యక్రమం

పద్మప్రసాదాచార్యులు ఆధ్వర్యంలో భక్తి రామనామస్మరణ నడుమ ధ్వజస్తంభాన్ని ప్రతిష్టంచారు. తొలుత విష్వక్సేన పూజ, పుణ్యాహవచనంతో ప్రారంభమైన ఈ ప్రతిష్టాపన కార్యక్రమం యంత్రప్రతిష్ట, పూర్ణాహుతితో ముగిసింది. గ్రామానికి చెందిన పులికం శ్రీనివాసులరెడ్డి, ప్రభావతమ్మ దంపతులు ఉభయకర్తలుగా వ్యవహరించగా, మర్రిబోయిన



జనార్ధన్ చేతులమీదుగా కార్యక్రమం నిర్వహించబడింది. అనంతరం జరిగిన సీతారామ కళ్యాణానికి భక్తులు అధిక సంఖ్యలో విచ్చేసి రామయ్య ఆశీస్సులు అందుకున్నారు.

● ఉదయగిరిలో

# తాగునీటికి కటకట!

ఉదయగిరి నియోజకవర్గంలోని వివిధ పాఠశాలల్లో త్రాగునీటి సమస్య తీవ్రంగా వుంది. విద్యార్థులు త్రాగేందుకు మంచినీరు దొరక్క అల్లాడిపోతున్నారు. రాజీవ్‌విద్యామిషన్ క్రింద మంచి నీటి బోర్లు ఏర్పాటు చేస్తున్నామని ఆర్భాటపు ప్రకటన లివ్వడం తప్ప చిత్తశుద్ధి లేకపోవడంతో నియోజక వర్గంలోని పలు ప్రాంతాల్లోని పాఠశాలల్లో నీటి సమస్య ఏర్పడింది. ఉదయగిరి, దుత్తలూరు, వరి కుంటపాడు, సీతారాంపురం, జలదంకి, కొండా పురం, వింజమూరు మండలాల్లోని పాఠశాలల్లో

## స్కూళ్లలో అల్లాడుతున్న విద్యార్థులు

అధికభాగం మంచినీటి సౌకర్యం లేని స్కూళ్లే వున్నాయి. విద్యార్థులకు దాహం వేస్తే గుక్కెడు నీళ్ల దొరకని పరిస్థితి. చివరకు మధ్యాహ్న భోజనం చేసేం దుకు మంచినీళ్లు లేకపోవడం వలన ఇంటి దగ్గర నుంచి సీసాల్లో నీటిని తెచ్చుకోవాల్సిన దుస్థితి. పాల కులు విద్యార్థులు పడుతున్న అవస్థలను పట్టించుకోక పోవడం వలన పిల్లలు పాఠశాలలకు రావాలంటేనే హడలి పోతున్నారు. జిల్లా కలెక్టర్ అయినా స్పం దించి ఈ ప్రాంతంలో గల పాఠశాల్లో మంచినీటి సౌకర్యం కల్పించాలని స్థానికులు కోరుకొంటున్నారు.

# ఎయిర్‌హోస్టెస్ ఇంట్లో దొంగతనం

● అనుమానం వ్యక్తం చేస్తున్న పోలీసు

సూళ్లూరుపేట పట్టణం సమీపంలో జరిగిన దొంగ తనం కలకలం రేపింది. ఇక్కడి కీర్తి ఎన్‌క్లేవ్ అపార్ట్ మెంట్‌లో శారద అనే ఎయిర్ హోస్టెస్ నివసిస్తోంది. చెన్నై జెట్ ఎయిర్‌వేస్‌లో పని చేసే ఆమె ఇక్కడ వుంటూ రాకపోకలు సాగిస్తుం టుంది. ఆమె ఇంట్లో ఒంటరిగా వున్న సమయంలో కాలింగ్ బెల్ కొట్టి ఇంట్లోకి ప్రవేశించిన దుండగులు ఆమె తలపైకొట్టి గాయ పరచి గదిలో వున్న 40వేల రూపాయల నగదు, బంగారు ఆభర ణాలను తస్కరించారట. స్పృహ వచ్చిన తర్వాత అరచి కేకలు పెట్ట డంతో చుట్టుప్రక్కల వారు వచ్చి పోలీసులకు సమాచారం అందిం చారు. అయితే కేసు దర్యాప్తు చేపట్టిన పోలీసులకు ఈ దొంగ తనంపై పలు అనుమానాలు వ్యక్తం అవుతున్నాయి. ఆ ఇంట్లో సిగ రెట్ పీకలు పడివుండడం, ఎయిర్‌హోస్టెస్ పొంతన లేని సమాధా నాలు చెప్తుండడం పట్ల పోలీసులు సందేహం వ్యక్తం చేస్తున్నారు.

## ఉత్తుత్తి ఆర్టీసి సదస్సులు

ప్రయాణీకులకు మెరుగైన సేవలు అందించేందుకు ఆర్టీసి తల పెట్టిన సదస్సులు నిష్ప్రయోజనమౌతున్నాయి. వీటి గురించి ముందుగా ఆయా ప్రాంతాల ప్రయాణీకులకు కనీసపాటి సమాచారమివ్వకుండా మధ్యాహ్నం వేళ ఆర్టీసి అధికారులు ఈ సదస్సులను ఏర్పాటు చేస్తుం డడంతో ప్రయాణీకులు లేని సదస్సులుగా మారుతున్నాయి ఇవి. ఇటీవల ముత్తుకూరులో నిర్వహించిన సదస్సు ఇదే రీతిలో సాగింది. రెండవ డిపో మేనేజర్ షమీమ్, సిఐ మురళీకృష్ణ, ఎడిసి రమేష్‌రెడ్డి మాత్రమే హాజరై సదస్సు నిర్వహించడం అధికారులకు వీటి పట్ల వున్న చిత్తశుద్ధిని తెలియజేస్తుంది. ఇద్దరు ప్రయాణీకులను పిలుచు కొని వచ్చి సదస్సు జరిగిందనిపించారు.

# పోలీస్‌స్టేషన్ ఎదుట ఆందోళన!

వెంకటగిరి పట్టణం కంపా శెంలో ఇటీవల కాలంలో ఇరువురు మృతి చెందిన విషయమై బాధిత కుటుంబాలు నిరసన చేపట్టాయి.

### వెంకటగిరిలో గొడవకు దారితీసిన హత్యలు

ఈ ప్రాంతంలోని హరిజనవాడలో కలపాటి మోహన్ హత్యకు గురయ్యాడు. కొద్దిరోజుల వ్యవధిలో రావూరి శ్రీనివా సులు అనుమానస్పద స్థితిలో మృతి చెందాడు. ఈ రెండు కేసుల్లో ఆయా కుటుంబాల వారు పోలీస్ స్టేషన్ వద్ద నిరసనకు దిగారు. మోహన్‌ను హత్య చేసిన వారే శ్రీనివాసులును హత్య చేశా రని ఆరోపించారు. తక్షణం నిందితులను అరెస్టు చేయాలని డిమాండ్ చేస్తూ బైఠా యించారు. ఈ హత్యకేసును మాఫీ చేయించేందుకు కొందరు నేతలు ప్రయ త్నిస్తున్నారంటూ ఆగ్రహించారు. సిఐ అబ్దుల్ కరీం అక్కడకు చేరుకొని బాధితు లకు న్యాయం చేస్తామని హామీ ఇవ్వ డంతో వారు శాంతించారు. మొత్తం మీద ఇద్దరు మృతి చెందిన వ్యవహారం పలు అనుమానాలకు తావిస్తుండడం చర్చ నీయాంశమయ్యింది వెంకటగిరిలో.

# కావలిలో మిస్టరీ హత్యలు!

కావలిలో ఇటీవల మృతి చెందిన వ్యక్తులకు సంబం ధించి పలు అనుమానాలు వ్యక్తం అవుతు న్నాయి. వీరిలో ఒకరు మున్సిపల్ కార్యాలయంలో పనిచేసే వాచ్‌మెన్ వెంకటాద్రి కాగా, మరో మృతదేహం ఝాన్సీ అనే విద్యార్థినిది. ఒకరు కార్యాలయ ఆవరణలో మృతి చెంది వుం డగా, మరొకరి మృతదేహం తుమ్మలపెంట సముద్రతీరంలో కన్పడింది. ఈ రెండు మృతదేహాలపై పలు సందేహాలు వ్యక్తం అవుతు న్నాయి. మున్సిపల్ కార్యాలయ మేనేజర్ కారణంగానే తన భర్త వెంకటాద్రి మరణించాడని, ఇది ఆత్మహత్యకాదు హత్యేనని ఆయన భార్య వసంత ఆరోపించింది. ఫిర్యాదు చేసినా పోలీసులు ఎందుకు మేనేజర్‌ను అరెస్టు చేయలేదని ప్రశ్నించారు. ప్రజాసంఘాలు వీరికి మద్దత్తుగా నిలిచాయి. ఇక

## పోలీసు దర్యాప్తే కీలకం

తుమ్మలపెంట సముద్రతీరంలో శవమై తేలిన ఝాన్సీ వింజ మూరు కళాశాలలో ఇంటర్ చదువుతూ హాస్టల్‌లో వుం టోంది. ఆమెను కొందరు యువకులు బైక్‌పై తీసుకొనిపోయి హత్య చేసి ఆత్మహత్యగా చిత్రీకరించారని కుటుంబ సభ్యులు ఆరోపించారు. దీని వెనుక ఎవరి హస్తం వుందనే దానిపై పోలీసు లోతుగా దర్యాప్తు సాగించి నిందితులను అరెస్టు చేయాలని డిమాండ్ చేస్తున్నారు. ఈ రెండు మరణాలపై అను మానాలు వ్యక్తం అవుతున్న నేపథ్యంలో పోలీసు ఎలా వ్యవహ రిస్తుందో ననేది చర్చనీయాంశమయ్యింది.

## బాసికం కట్టుకొనేదెవరు?



నెల్లూరు పార్లమెంట్ స్థానానికి కూడా మరో ఆరు నెలల్లో ఉపఎన్నికలు జరుగనున్నాయి. వైఎస్.జగన్మోహన్‌రెడ్డి మంచి చెడ్డలు చూస్తూ మేకపాటి రాజమోహన్‌రెడ్డి కాంగ్రెస్ పార్టీకి రాజీనామా చేశారు. దీంతో రేపటి ఎన్నికల్లో వైఎస్‌ఆర్ కాంగ్రెస్ పార్టీ తరఫున రాజమోహన్‌రెడ్డినే పోటీ చేస్తారు. తెలుగుదేశం తరఫున గతంలో ఓడిపోయిన వంటేరు వేణుగోపాల్ రెడ్డినే పోటీలో వుంటారు. అధికార కాంగ్రెస్ తరఫున మాత్రం పోటీ చేయను ఎవరూ ముందుకు రావడం లేదు. నువ్వు పోటీ చేయన్నా... చేయక్కా అని వివేకానందరెడ్డి పలువురు పేర్లు మార్కెట్‌లో వదిలారు. వీటిలో తిక్కవరపు సుబ్బరామిరెడ్డి, లగడపాటి రాజగోపాల్, నేదురుమల్లి జనార్దన రెడ్డి, రాజ్యలక్ష్మమ్మ, మాగుంట పార్వతమ్మ, ఆనం రామనారాయణరెడ్డి పేర్లు వున్నాయి. మెగాస్టార్ చిరంజీవికి కూడా నెల్లూరుతో సంబంధాలు వున్నాయి కాబట్టి ఆయన పేరును ట్రంకురోడ్డులో చర్చకు పెట్టేశారు. చివరికి టిక్కెట్ తీసుకొని పోటీకి బాసికం కట్టుకొనేదెవరో?

## పోటీలో రెడ్డి త్రయం!




కోవూరు ఉపఎన్నికలో ప్రధాన పార్టీల నుంచి పోటీ చేస్తున్న ముగ్గురు అభ్యర్థులు రెడ్డి కులస్తులే. వారి ఇంటి పేరు... అసలు పేరులోనూ 'రెడ్డి' పదం ఇమిడి గుబాళిస్తున్నది. తెలుగుదేశం అభ్యర్థి సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి, కాంగ్రెస్ అభ్యర్థి పోలంరెడ్డి శ్రీనివాసులురెడ్డి, వైఎస్ఆర్ కాంగ్రెస్ అభ్యర్థి నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి పేర్లలో రెడ్డి ఘనత ధ్వనించడంపై విచిత్ర చర్చ జరుగుతోంది.

## ఎంత ఎన్నికల అధికారులైనా...



ఎన్నికల అధికారులను జిల్లాలో బీస్ దిన్ కా సుల్తానులుగా అభివర్ణించవచ్చు. ఎన్నికల కమిషన్ ఇచ్చిన అపరిమిత అధికారాలతో మార్చి 21తేది వరకు వాళ్ల ముందు కొమ్ములు తిరిగిన నాయకులు కూడా సార్ అంటూ సర్దుకోవాల్సిందే. కాని ఈ అధికారులు తాము ప్రజలకు జవాబుదారీ అని, పౌర సమాజం తమను గమనిస్తుందని మర్చిపోకూడదు. కోవూరు ఎన్నికల వ్యయపరిశీలనకు వచ్చిన అధికారి నగరంలోని ఓ హోటల్ వద్ద టిఫిన్ చేయను నడిరోడ్డులో తన కారు ఆపేసి వెళ్లిపోయారు. దీంతో ఆ ప్రాంతంలో ట్రాఫిక్ నిలచిపోయింది. ఎంత ఎన్నికల అధికారులైనా అతి సర్వత్ర వర్జయేత్ అని గుర్తుంచుకోమంటున్నారు జనం.

## కిషోర్‌దాస్ బృందం సందడి!



టీవీ9లో ప్రతి ఆదివారం ప్రసారమయ్యే 'ఎవడిగోల వాడిదే' కార్యక్రమంలో డూప్ ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి, చంద్రబాబు నాయుడు, జగన్, కెసిఆర్, చిరంజీవి, అంబటి రాంబాబులు చేసే విన్యాసాలు ప్రేక్షకులను కడుపుబ్బా నవ్విస్తాయి. ఈ బృందంతోపాటు వీరి నాయకుడు కిషోర్‌దాస్ కోవూరు ప్రచారంలో దిగేశారు. ఈ పార్టీ ఆ పార్టీ అనే తేడా లేకుండా డూప్ చిరంజీవి, కిరణ్‌కుమార్‌రెడ్డి కాంగ్రెస్‌కు చంద్రబాబు తెలుగుదేశంకు, వైకాపాకు జగన్ ప్రచారం చేస్తున్నారు. ఈ డూప్‌ల ప్రచారం తర్వాత అసలు నాయకులే కోవూరు వస్తుండడం కాస్త విశేషం.



వెంకటపాళెం పంచాయితీ అధ్యక్షుడుగా సుదీర్ఘ కాలం పాటు పని చేసిన మూలంరెడ్డి వెంకటకృష్ణారెడ్డి మనుమడు మనోజ్‌కుమార్, వైశాలిల వివాహం ఫిబ్రవరి 26తేది నెల్లూరు అనిల్ గార్డెన్స్‌లో జరిగింది.

## తులసిచెట్టు పూజతో పుణ్యఫలాలు దక్కుతాయి!

శ్రీమహావిష్ణువుకు ప్రీతికరమైనది తులసి. అందుకే ప్రతి ఇంట్లో తులసి చెట్టును పెంచుతారు. దీనిని లక్ష్మీస్వరూపంగా భావించి పూజిస్తారు. తులసిచెట్టు పెంచడానికి వీలు లేని అపార్టుమెంట్లు, ఇతర భవనాల్లో తులసికోటను కొని దానిలో తులసి మొక్కను నాటి ప్రతిరోజూ పూజచేస్తారు. తులసి మొక్కకు పూజ చేయడం, స్పర్శించడం వల్ల సర్వపాపాలు తొలగుతాయని, అనారోగ్యాలు దరిచేరవని చెప్తారు. తులసి చెట్టు ఇంట్లో వుంటే ఆ గృహం పవిత్రంగా భావించబడడం తోపాటు ఆ ఇంట సిరులు, సౌభాగ్యం వుంటుందని పురాణాలు చెప్తున్నాయి. తులసి పూజ చేసినట్లయితే ఆ ఇంటిలో సమస్త దేవతలు నివాసం వుంటారని చెప్తారు. లక్ష్మీదేవి స్వరూపంగా భావించే తులసి చెట్టుకు పూజచేయడం వలన కలిగే పుణ్యఫలాల గురించి పద్మపురాణంలో వివరించబడింది. తులసి మొక్క వున్నచోట పంచ భూతాలు పరిశుద్ధమవుతాయట.

లక్ష్మీదేవి కొలువై వుండి, శ్రీహరికి ఇష్టమైన తులసిలో రెండు రకాలు వున్నాయి. ఒకటి కృష్ణ తులసి, రెండోది లక్ష్మీ తులసి. ఒకటి పురుష జాతికి, మరొకటి స్త్రీ జాతికి చెందినది. కృష్ణ తులసి ఆకులు చిన్నవిగా వుండి, ముదురు ఆకుపచ్చ రంగులో వుంటాయి. లక్ష్మీ తులసి ఆకులు వెడల్పుగాను లేత ఆకుపచ్చరంగులోను వుంటాయి. ఈ రెండు తులసి మొక్కలు ఎంతో పవిత్రమైనవి, శ్రేష్టమైనవి. దేవీ భాగవతంలోనూ వీటి ప్రస్తావన వుంది. తులసికి బృంద, నందిని, బృందావనీ, విశ్వపావనీ, విశ్వపూజిత, కృష్ణ జీవని అనే అష్టనామాలు వున్నట్లు పురాణాలు చెప్తున్నాయి. తులసి పూజ చేసేవారు ఈ ఎనిమిది రకాల పేర్లను పఠిస్తూ పూజిస్తే విశేష ఫలితాలను పొందుతారని చెప్తారు. ఆధ్యాత్మికంగా తులసికి వున్న ప్రాధాన్యం అంతా ఇంతా కాదు. అందుకే భగవంతునికి సమర్పించే అన్ని మాలల్లోకి తులసి మాలకు విశిష్టత వుంది. వివిధ పుష్పాలతో రూపొందించే మాలల్లో సైతం తులసీ దళాలను కడతారు. ఆలయాల్లో భక్తులకు ఇచ్చే తీర్థంలోనూ తులసీ దళాలు వేస్తారు. దీని వలన ఆ నీటికి పవిత్రత చేకూరుతుంది. మనిషికి అంత్య సమయం వచ్చినప్పుడు వారినోట్లో తులసి తీర్థం పోస్తారు. దాని వలన వారికి ముక్తి లభిస్తుందని నమ్మకం. శివకేశవులను తులసీ దళాలతో పూజించినట్లయితే పునర్జన్మ కలుగదట. లక్ష్మీదళ వ్రతం ఆచరించి శ్రీహరిని అర్చిస్తే సమస్త సంపదలు సమకూరుతాయని చెప్తారు. ఔషధపరంగాను తులసి ఎంతగానో ఉపయోగపడుతుంది. వాతావరణాన్ని పరిశుభ్రం చేసి స్వచ్ఛమైన గాలిని అందిస్తుంది తులసి. జీర్ణ క్రియకు ఎంతగానో దోహదపడుతుంది. తులసి చెట్టును పూజించడం వలన అటు ఆధ్యాత్మికంగానే కాక ఆరోగ్య పరంగాను ఎంతో మేలు జరుగుతుంది.

● ప్రసన్నను

# చిత్తుగా ఓడించండి!


సాలుచింతల సెంటర్‌లో సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డికి మద్దతుగా జరిగిన రోడ్‌షోలో మాట్లాడుతున్న తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు నారా చంద్రబాబు నాయుడు.

కోవూరులో జరిగే ఉప ఎన్నిక నీతికి, అవినీతికి మధ్య జరిగే ఎన్నికలని తెలుగుదేశంపార్టీ అధ్యక్షుడు చంద్రబాబునాయుడు అభివర్ణించారు. నియోజకవర్గంలోని పలు ప్రాంతాలలో ప్రచారం నిర్వహించేందుకు మార్చి 4న జిల్లాకు వచ్చిన ఆయన దామరమడుగు నుంచి రోడ్‌షో ప్రారంభించారు. అక్కడి నుంచి రేబాల మీదుగా బుచ్చిరెడ్డిపాళెం వరకు వివిధ ప్రాంతాలలో ప్రజలనుద్దేశించి ప్రసంగించారు. వైఎస్ జగన్మోహన్‌రెడ్డి ధనదాహం కారణంగా ఈ ఎన్నికలు వచ్చాయన్నారు. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ముఖ్యమంత్రిగా వున్న కాలంలో రాష్ట్రాన్ని దోచుకున్నాడని, వందలకోట్ల అవినీతి సొమ్మును ఆర్జించిన జగన్ అధికారం, పదవి కాంక్షతో ఎమ్మెల్యేలకు కోట్లాదిరూపాయలు ఆశ చూపి ఉప ఎన్నికలు వచ్చేందుకు కారణమయ్యాడని విమర్శించారు. వైఎస్‌ఆర్ కాంగ్రెస్‌పార్టీ అభ్యర్థి ప్రసన్నకుమార్‌రెడ్డి విశ్వసనీయత కోల్పోయారని, పర్సెంటేజీల ప్రసన్నగా మారారని ఎద్దేవా చేశారు. తెలుగుదేశంపార్టీ రాజకీయ భిక్ష పెట్టి, ఐదుసార్లు ఎమ్మెల్యే టిక్కెట్ ఇచ్చి గెలిపిస్తే డబ్బులకు అమ్ముడుపోయాడని ఆరోపించారు. అలాంటి వ్యక్తిని చిత్తుగా ఓడించాలని ఓటర్లకు పిలుపునిచ్చారు. అధికార కాంగ్రెస్ పార్టీపైనా విమర్శలు చేశారు. జాక్‌పాట్ సిఎం అంటూ కిరణ్ కుమార్‌రెడ్డిని ఉద్దేశించి వ్యాఖ్యానించారు. కాంగ్రెస్ పాలనలో పేద ప్రజలు జీవించలేకపోతున్నారని, తెలుగుదేశం పార్టీ పాలనలోనే పేదలకు న్యాయం జరిగిందన్నారు. పోరాట యోధుడిగా పేరుగాంచిన సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డిని గెలిపించాలని పిలుపు నిచ్చారు. ఈ కార్యక్రమంలో సోమిరెడ్డితో పాటు బీద రవిచంద్ర, గోవర్ధన్ రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

## శత్రు సంహార యాగం చేసిన ప్రసన్న!



ఈ రోజుల్లోనూ ఇటువంటి యాగాలు చేసే రుత్వికులు, చేయించే వ్యక్తులు ఉన్నారంటే నమ్మబుద్ధి కాదు. కానీ ప్రసన్నకుమార్‌రెడ్డి శత్రు సంహార యాగం చేసిన విషయం వాస్తవమంటున్నాడు కోవూరులో తెలుగుదేశం అభ్యర్థి సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి. ఈ విషయమై వివరిస్తూ నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డికి ఇటువంటి యాగాలు చేయడం అలవాటు. నాతోపాటు, కాంగ్రెస్ పార్టీ అభ్యర్థిగా పోటీచేస్తున్న పోలంరెడ్డి శ్రీనివాసులురెడ్డి జాతకాలు సేకరించి వాటి ప్రకారం ప్రసన్న శత్రు సంహార యాగం చేశాడని సోమిరెడ్డి కుండబద్దలు కొట్టాడు. నల్లపురెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి తండ్రి స్వర్గీయ శ్రీనివాసులు రెడ్డికి వివిధ సమస్యల మీద ఎంతస్థాయి వారికైనా ఉత్తరాలు వ్రాసే మంచి అలవాటు ఉండేది. కుమారుడికేమో శత్రు సంహార యాగాలు? క్షుద్రపూజలు చేసే అలవాటు?? కోవూరులో జనం తెలివిగలవారని వాస్తవాస్తవాలు గమనిస్తారని ప్రతీతి. హేతువాదులు, కమ్యూనిస్టులు మాత్రం కోవూరులో ఏమిటీ న్యూసెన్స్ అంటున్నారు. అంతిమ ఫలితం ఏమిటన్నది 21తేది తేలుతుంది.

# కోవూరులో గెలుపుపై పోలంరెడ్డి ధీమా!

కోవూరు నియోజకవర్గం నుంచి కాంగ్రెస్ పార్టీ అభ్యర్థిగా పోటీ చేస్తున్న పోలంరెడ్డి శ్రీనివాసులురెడ్డి తాను ప్రజల మనిషినని చెప్పుకొన్నారు. 'జమీన్‌రైతు' విలేఖరితో ఆయన మాట్లాడుతూ నేను స్థానికుడిని. నా స్వగ్రామం నార్తురాజుపాళెం. ఇక్కడే పుట్టి పెరిగాను. ఇక్కడ ప్రజలతో మమేకమై జీవించాను; జీవిస్తాను. నియోజకవర్గంలో ప్రతి గ్రామంపైనా నాకు అవగాహన వుంది. పేదరికం, ఆకలి, వారు ఎదుర్కొంటున్న సమస్యలు ఏమిటో తెలుసు. ప్రతిగ్రామంలో కాంగ్రెస్‌కు బలమైన, పటిష్టమైన క్యాడర్ వుంది. అన్నిస్థాయిల్లోని నేతలు కలసికట్టుగా పని చేస్తున్నారు. ప్రచారానికి వెళ్లినప్పుడు ప్రజలు ఆప్యాయతతో ఆదరిస్తున్నారు. కోవూరులో నా గెలుపుపై ఎటువంటి సందేహం లేదని ఆయన కుండబద్దలు కొట్టారు. వివిధ ప్రశ్నలపై ఆయన స్పందన ఇలా వుంది.

***ప్రశ్న : కోవూరులోనే ఎందుకు పోటీ చేస్తున్నారు?***

జవాబు : ఈ నియోజకవర్గంలోని ముఖ్యమైన గ్రామం నార్తురాజుపాళెంలోనే పుట్టి పెరిగాను. కోవూరు ఐటిఐలో ఐటిఐ చదివాను. నేను స్థానికుడిని, ఇక్కడి ప్రతి గ్రామంలోని ప్రజల జీవన విధానం నాకు బాగా తెలుసు. అందుకే కాంగ్రెస్‌పార్టీ గుర్తించి 2004లో పార్టీ టిక్కెట్ ఇచ్చింది. తొలి ప్రయత్నంలోనే ఎమ్మెల్యేగా గెలిపించారు. ప్రజల సమస్యలు నా సమస్యలుగానే భావించి పరిష్కరించా. ఇది గుర్తించే 2009లో పార్టీ రెండవసారి పార్టీ టిక్కెట్ ఇచ్చినా దురదృష్టవశాత్తు ఓడిపోయాను. ఈ విషయాన్ని పార్టీ అధిష్టానవర్గం మనసులో పెట్టుకొని ఈ ఉపఎన్నికల్లోనూ పోటీచేసే అవకాశం ఇచ్చింది.

***ప్రశ్న: ఏ విధంగా గెలుస్తారు?***

జవాబు: నార్తురాజుపాళెంలోని చిన్న, సన్నకారు రైతు కుటుంబం నుంచి వచ్చాను. రైతుబిడ్డగా బతికాను. బతుకుతున్నాను. పేదరికం, ఆకలి బాధలు నాకు బాగా తెలుసు. అవినీతితో ఒక్కపైసా సంపాదించలేదు. ప్రజాసేవ చేయాలనే రాజకీయాల్లోకి వచ్చాను. నా తరఫున ప్రచారానికి ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డి, పిసిసి అధ్యక్షుడు బొత్సా సత్యనారాయణ, మెగాస్టార్ చిరంజీవి తరలివస్తున్నారు. ఇప్పటికే ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి నాకు మద్దతుగా విస్తృత ప్రచారం చేస్తున్నారు. ఎమ్మెల్యేలు ఆనం వివేకానందరెడ్డి, ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి, ఆదాల ప్రభాకర్‌రెడ్డి గ్రామ గ్రామంలో తిరుగుతున్నారు. నేను స్థానికుడ్ని కావడం వల్ల ఎక్కడకు వెళ్లినా ప్రజలు హృదయపూర్వకంగా స్వాగతం పలుకుతున్నారు. ఈ ఆదరణే నా గెలుపుకు సంకేతం.

***ప్రశ్న : నియోజకవర్గంలో గుర్తించిన సమస్యలేమిటి? వాటినెలా పరిష్కరిస్తారు?***

జవాబు : నేను ఎమ్మెల్యేగా ఎన్నికైన 2004–2009 కాలం కోవూరుకు స్వర్ణయుగంగా చెప్పొచ్చు. సమస్యలతో మూతపడిన కోవూరు షుగర్ ఫ్యాక్టరీని తెరిపించాను. డిగ్రీకాలేజి ఏర్పాటు చేశాను. పెన్నాడెల్టా ఆధునీకరణ పనులు ప్రారంభించాను. రైతులకు ధాన్యం మద్దతు ధర కోసం పోరాడాను. ఇఫ్కో కిసాన్‌సెజ్‌కు శంకుస్థాపన చేయించాను. ఈ పనుల ప్రగతికి జిల్లా మంత్రి ఆనం రామనారాయణరెడ్డిని తీసుకొని ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి దగ్గరకు వెళ్లి పరిష్కార మార్గాలు వెతుకుతాను. 2009 ఎన్నికల్లో గెలిచిన ప్రసన్న సొంత లాభంకోసం నియోజకవర్గాన్ని గాలికి వదిలివేశాడు. ఈ విషయం ప్రజలకు బాగా తెలుసు.

***ప్రశ్న: కోవూరులో మీ ప్రత్యర్థి ఎవరు?***

జవాబు: 2009 ఎన్నికల్లో తెలుగుదేశం ఎమ్మెల్యేగా గెలుపొందిన నల్లపురెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి ఆ పార్టీ కేడర్‌ను తన వెంట తీసుకెళ్లాడు. నియోజకవర్గంలో వున్న కాంగ్రెస్ ఓటు బ్యాంకు చెక్కుచెదరలేదు. దీంతోపాటు కాంగ్రెస్ నేతలంతా పార్టీలోనే వున్నారు. సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి మా పార్టీ నేతలను ప్రలోభపెట్టే పనిలో విఫలమయ్యాడు. పిలిస్తే పలికేవాడిగా ప్రజలంతా నన్ను గుర్తించారు. గెలిపించబోతున్నారు.

***ప్రశ్న : ప్రసన్న, చంద్రమోహన్‌రెడ్డి విమర్శలను ఎలా తిప్పికొడతారు?***

జవాబు : ప్రసన్నకుమార్‌రెడ్డి ఎమ్మెల్యేగా 2009 నుంచి 2012వరకు కొనసాగినా దీర్ఘకాలిక సమస్యలు పరిష్కరించడంలో పూర్తిగా విఫలమయ్యారు. ధనార్జన ధ్యేయంగా ఆయన ప్రస్థానం కొనసాగింది. ప్రసన్నకు దమ్ము, ధైర్యం వుంటే ఏ అభివృద్ధి పని చేశారో చెప్పమనండి చూద్దాం? ఉపఎన్నికలు ప్రసన్న పుణ్యానే వచ్చాయి. తెలుగుదేశం విమర్శలు పసలేనివి. వాస్తవానికి ప్రసన్న, చంద్రమోహన్‌రెడ్డి నాకు ప్రత్యర్థులే కారు.

> పోలంరెడ్డి శ్రీనివాసులురెడ్డి 'జమీన్‌రైతు'తో మాట్లాడుతూ "నేను ప్రజల మనిషిని, స్థానికుడిని, ప్రతి సమస్యా తెలిసినవాడిని, ఎమ్మెల్యేగా ఎన్నో సమస్యలు పరిష్కరించానని అవే నాకు శ్రీరామరక్ష. కాంగ్రెస్ పార్టీ కార్యకర్తలు, నాయకుల కలసికట్టుగా చేస్తున్న ప్రచారంతో విజయం తథ్యమన్నారు".

***ప్రశ్న : జగన్‌ను చూసి తనకు ఓటేయమని ప్రసన్న చెబుతున్నారే?***

జవాబు : స్వర్గీయ వైఎస్ రాజశేఖర్‌రెడ్డి సమైక్యాంధ్రకే కట్టుబడి పనిచేశారు. ఆయన తనయుడు జగన్మోహన్‌రెడ్డి తెలంగాణ రాష్ట్రసమితి నేతలతో చేతులు కలిపి తెలంగాణాలో పోటీ చేయక కోవూరులో పోటీ చేస్తున్నాడు. వైఎస్‌ఆర్ కాంగ్రెస్ పార్టీ అధ్యక్షునిగా జగన్మోహన్‌రెడ్డి వ్యవహరిస్తున్న తీరుపై ఎన్నో సందేహాలు వ్యక్తం అవుతున్నాయి. ఆయన రాష్ట్రాన్ని రెండు ముక్కలు చేసేందుకు కుట్రపన్నుతున్నారు. జగన్‌పార్టీకి ఓటు వేస్తే కచ్చితంగా రాష్ట్ర విభజనకు నాంది పలికినట్లే. కోవూరు ప్రజలు తెలివైన వారు. అంతపెద్ద తప్పు చేయరని నేను భావిస్తున్నాను.

***ప్రశ్న : మీ పార్టీలో గ్రూపుల మాటేమిటి?***

జవాబు : అఖిలభారత కాంగ్రెస్‌పార్టీకి 127ఏళ్ల చరిత్ర వుంది. నేతల మధ్య చిన్న చిన్న స్పర్థలు మామూలే. కానీ ఎన్నికల సమయంలో ఇవన్నీ మర్చిపోయి పనిచేస్తారు. దీనికి మొన్నటి ఎమ్మెల్సీ ఎన్నికల్లో వాకాటి నారాయణరెడ్డి గెలుపే ఉదాహరణ. కోవూరులో ప్రస్తుతమైతే గ్రూపుల గొడవే లేదు.




ఈవారం అనుకూలంగా వుండడంతోపాటు అన్ని కార్యక్రమాలు పూర్తి చేస్తారు. బంధుమిత్రుల సహకారంతో వివాహాది శుభ కార్యాలు పూర్తి చేస్తారు. ఆర్థికంగా బాగున్నప్పటికీ శ్రమాధిక్యత వల్ల అలసట, నీరసం వంటి వుండవచ్చు. విద్యార్థులకు అత్యంత అనుకూలం. వ్యవసాయదారులకు గతం కంటే మేలు. వ్యాపారస్తులకు ఆదాయ, వ్యయాలు సమానంగా వుంటాయి.




ఈ రాశి వారికి మిశ్రమ ఫలితాలుంటాయి. ముఖ్యమైన పనులు లేదా కోర్టు వ్యవహారాలు వాయిదా వేసుకోవడం మంచిది. వృత్తి, వ్యాపార రంగాలలోని వారు ఆర్థికంగా ఆచితూచి వ్యవహరించడం మంచిది. వ్యవసాయ పనులు ఆటంకాలు లేకుండా జరుగుతాయి. రాజకీయ రంగంలోని వారు తమ ప్రతిష్టకు భంగం కలుగకుండా చూసుకొనేది. విద్యార్థులకు బాగుంటుంది.




చేసే పనులలో రాజీ ధోరణి, సర్దుబాటు అవసరం. మీ తెలివి తేటలతో నష్టం రాకుండా చూసుకోగలరు. వ్యవసాయదారులకు అనుకూలం. రాజకీయ రంగంలోని వారికి శారీరక శ్రమ అధికం. దూర ప్రాంతాల నుండి ఆహ్వానం అందుకొంటారు. క్రీడా, కళా రంగాలలోని వారికి ఆటంకాలు తొలగుతాయి. ఇతరులతో శత్రుత్వం రాకుండా చూసుకొనేది.




ఈ రాశి వారు అధిక శ్రమతో తమ పనులు పూర్తి చేయగల్గుతారు. అధిక ఖర్చులు, వృధా ప్రయాణాలు తప్పవు. శుభకార్యాలలో అధిక ధన వ్యయమౌతుంది. మిమ్మల్ని మోసం చేసే వారి నుండి దూరంగా వుండండి. వ్యాపారులకు సామాన్యం. రాజకీయ రంగంలోని వారికి ఆటంకాలు, మిత్రుల నుంచి వ్యతిరేకత, మానసిక అశాంతి తప్పవు. వ్యవసాయదారులకు ఒడిదుడుకులు తొలగుతాయి.




ఆర్థికంగా గతం కన్నా బాగుంటుంది. వ్యాపారస్తులకు అనుకూలమైన వారం. వివాహ, విందు, వినోదాలలో పాల్గొంటారు. వ్యవసాయదారులకు ఆర్థికంగా నిలకడగా వుంటుంది. కళా, క్రీడా రంగాలవారికి ప్రోత్సాహకరంగా వుంటుంది. రాజకీయ రంగంలోని వారు ఇతరులతో మాట్లాడునప్పుడు జాగ్రత్త వహించాలి. తొందరపడి మాట ఇవ్వవద్దు. వృధా ప్రయాణాలు, ధనవ్యయం.




ఈ రాశి వారు చేసే పనులు గుర్తింపుకు వస్తాయి. వివాహాది శుభ కార్యాలు, ఆధ్యాత్మిక కార్యక్రమాలలో పాల్గొంటారు. వ్యవసాయదారులు తమ లక్ష్యాలు సాధిస్తారు. విద్యార్థులకు మానసిక అశాంతి. ఉద్యోగస్తులు చేసే పనులలో మిశ్రమ ఫలితాలు వుంటాయి. కళా, క్రీడా రంగాలలోని వారికి దుఃఖ నాశనం, వస్తు లాభం. వినోద కార్యక్రమాలలో పాల్గొంటారు.

# వారఫలాలు

*తేది 10–03–2012 నుండి 16–03–2012 వరకు మేషంలో గురు, శుక్రులు; వృషభంలో కేతువు; సింహంలో కుజుడు; తులలో శని; వృశ్చికంలో రాహువు; మార్చి 13తేది వరకు కుంభంలో రవి తదుపరి మీనంలో; మీనంలో బుధుడు; కన్య, తుల, వృశ్చిక, ధనుస్సులలో చంద్రుడు సంచరిస్తారు.*

## పంచాంగం

14తేది ప. 10.40 గం.లకు మీన సంక్రమణం ప్రయుక్త షడశీతి పుణ్యకాలం.

### శుభ ముహూర్తాలు

10, 11, 12, 14తేదీలలో వివాహ, ఉపనయన, అక్షరాభ్యాస, గృహారంభ, గృహప్రవేశ, సాధారణ పనులకు సుముహూర్తాలున్నాయి.

### మార్చి తిథులు

**ఫాల్గుణ బహుళ**

| | | | | | |
|---|---|---|---|---|---|
| 10 | శని | తదియ | ఉ | 07.37 | గం.ల.వ |
| 11 | ఆది | చవితి | రా | 02.42 | గం.ల.వ |
| 12 | సోమ | పంచమి | రా | 11.58 | గం.ల.వ |
| 13 | మంగళ | షష్ఠి | రా | 09.36 | గం.ల.వ |
| 14 | బుధ | సప్తమి | రా | 07.41 | గం.ల.వ |
| 15 | గురు | అష్టమి | సా | 06.13 | గం.ల.వ |
| 16 | శుక్ర | నవమి | సా | 05.13 | గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, డిఎస్ఆర్ నగర్, నవలాకులతోట,
నెల్లూరు – 2. సెల్: 95819 76599.




చేసే పనులందు తరచూ ఆటంకాలున్నప్పటికీ నిదానంగా పూర్తి చేస్తారు. ఇంటా బయట బంధుమిత్రులతో మాట పట్టింపులు. తండ్రి సంబంధిత వర్గంతో భేదాభిప్రాయలుంటాయి. విద్యార్థులకు పరీక్షా కాలం. వ్యవసాయదారులకు తమ పంటలపై ప్రత్యేక శ్రద్ధ అవసరం. కళా, క్రీడా రంగాలలోని వారు చేసే పనులు, లావాదేవీలు లాభించవు. కోర్టు పనులు, వ్యవహారపు చిక్కులు బాధిస్తాయి.




చేసే పనులందు ఆలోచన, తగు జాగ్రత్తలు అవసరం. భార్యాపిల్లలతో ఘర్షణలు, గొడవలు రాకుండా చూసుకొనేది. అకారణ దూర ప్రయాణాలు సంభవం. మనశ్శాంతి తక్కువ. అనుకున్నది సాధించేందుకు అధిక శ్రమ అవసరం. విద్యార్థులకు అననుకూలమైన కాలం. వ్యవసాయ రంగంలోని వారికి ఆర్థిక ఇబ్బందులు ఏర్పడతాయి. వ్యాపారస్తులు ఆచితూచి అడుగేయాలి.




తలపెట్టిన పనులు పూర్తి చేయగలరు. ఆర్థికపరమైన ఒత్తిడులు అధికం. వ్యాపార రంగంలోని వారికి సామాన్యం. ఉద్యోగులకు పై అధికారుల ఒత్తిడి అధికం. వివాదాలు రాకుండా చూసుకొనేది. భూసంబంధ వ్యవహారాలు అనుకూలిస్తాయి. విద్యార్థులకు బాగుంటుంది. రాజకీయ రంగంలోని వారికి ప్రయాణాలలో ఆటంకాలు, భోజన అసౌకర్యం, వారాంతంలో స్వల్ప శరీరారోగ్య లోపం.




వృత్తి, వ్యాపార, ఉద్యోగ రంగాలలోని వారు చేసే నిర్ణయాలు ఒక్కసారి ఆలోచించి చేయడం మంచిది. బంధుమిత్రుల సలహాలు, ఒత్తిడుల చేత తప్పుడు నిర్ణయాలు తీసుకొనే అవకాశం వుంది. ఆర్థిక లావాదేవీలు, శుభకార్యాలలో మిశ్రమ ఫలితాలుంటాయి. నూతనంగా ప్రారంభించే వ్యాపారాలకు అనుకూలం. వ్యవసాయ రంగంలోని వారికి గతం కంటే మేలు. ఆధ్యాత్మిక చింతన అవసరం.




ఆర్థికంగా బాగుండి ఉత్సాహంగా వుండగలరు. పనులు సకాలంలో పూర్తి చేయగలరు. బంధుమిత్రులతో అనవసర గొడవలు, అకారణ కోపం, విసుగు, మనశ్శాంతి తక్కువగా వుంటుంది. విద్యార్థులకు అనుకూలమైన వారం. వ్యవసాయ రంగంలోని వారికి గతం కంటే మేలు. కళా, క్రీడా రంగాలలోని వారు వివాదాలు పరిష్కారమై మంచి వార్తలు వింటారు. రాజకీయ రంగంలోని వారికి బాగుంటుంది.




ఈ రాశి వారు చేపట్టే నూతన కార్యక్రమాలు సంతృప్తినివ్వగలవు. వ్యాపారస్తులకు ఆర్థికంగా బాగుంటుంది. మంచి లాభాలనార్జించగలరు. ఉద్యోగులకు అనుకూలమైన చోటుకు బదలీలు వుండవచ్చు. విద్యార్థులకు పై చదువులకు మార్గం సుగమమౌతుంది. విందు, వినోదాలలో పాల్గొంటారు. వ్యవసాయ రంగంలోని వారికి సామాన్యంగా వుంటుంది. గతంలో ఏర్పడిన సమస్యలు తొలగిపోతాయి.

# ఈశాన్యంలో మొక్కలు పెంచకూడదు!

*ఎం.సుగుణ — నెల్లూరు*

** పెరట్లో తూర్పు, ఉత్తరాల్లో మొక్కలు వేయకూడదా?*

ఆ దిక్కుల్లో తాత్కాలికంగా పుష్పించే, ఫలించే మొక్కలు పెంచుకోవచ్చు. అయితే నాలుగవ భాగమైన ఈశాన్యంలో కూడదు.

*వై.సుమలతారెడ్డి — నెల్లూరు*

** ప్లాటులో నైరుతి పెరిగింది. వారు తీవ్ర అనారోగ్యానికి గురయ్యారు. పరిష్కారం చెప్పండి?*

నైరుతి వ్యాధి, మరణమని శాస్త్రం చెబుతోంది. ఖాళీ చేయడం మంచిది. యంత్ర పరిష్కారాలు కూడా ఉన్నాయి. వివరాలు పంపితే యంత్రం చెబుతాను.

*డి.చంద్రప్రభ — కావలి*

** పిల్లల పరీక్షలొస్తున్నాయి. శాస్త్ర విధివిధానాల్ని చెప్పండి?*

తూర్పు, ఉత్తర దోషాలు లేకుండా చూసుకోండి. గదుల్లో కుండీలలో తులసి మొక్కలను ఉంచండి. పసుపు, పచ్చ రంగులు గదుల్లో ఏకాగ్రతను కలిగిస్తాయి. 'లక్ష్మీకృత వాస్తు' యంత్రం వారిని మానసికంగా పరీక్షలకు సిద్ధం చేస్తుంది.

*ఎం.కౌండిన్య — తిరుచానూరు*

** యంత్రం ఎలా తయారవుతుంది? వివరాలు నాకు చాలా అవసరం.*

దంపతుల నామాక్షరాలు, గృహస్థితి గణించి మంత్ర బీజాక్షరాల చార్టు తిరుత్తణికి పంపి, యంత్రం తయారు చేయిస్తాం. తర్వాత మూడు రోజుల యంత్ర పూజ తర్వాత అది మీకందుతుంది.

*పి.వి.ఎన్ — నాయుడుపేట*

** పాప అనారోగ్య పరిస్థితి బాగుపడడం లేదు. వైద్యులు పెదవి విరుస్తున్నారు.*

శాస్త్రరీత్యా యంత్రం, రత్నధారణ చేసి 'రుద్రాక్ష' మండల పూజా విధానాన్ని చేస్తే, ఆయన అనుగ్రహం లభిస్తే 'పాప' మృత్యువునుంచి బయటపడుతుంది.

*సి.బిందు — సూళ్లూరుపేట*

** వీధిపోట్ల సంగతి సరే, వీధి చూపుల సంగతేమిటి?*

పోట్లు విపరీత పరిణామాల్ని కలుగజేస్తే, వీధి చూపులు ఈశాన్యం, ఆగ్నేయం, వాయువ్యం 'దిష్టి దోషాల్ని' కలిగిస్తాయి.

*ఎన్.సుదర్శనరావు — తిరుపతి*

** మా వీధిలో అపార్టుమెంటు నిర్మిస్తున్నారు. మా ఇళ్లకేమైనా అరిష్టమా?*

తూర్పు, ఉత్తరాల్లో ఎత్తైన నిర్మాణాల వల్ల గృహస్థులు ఆర్థిక, మానసిక సమస్యలతో సతమతమవుతారు. 'లక్ష్మీగణపతి' యంత్ర ప్రతిష్ట చేసుకోండి.

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*సి.శ్రీపతినాయుడు — తిరుపతి*

** తూర్పు ఇల్లు. ఆగ్నేయం వీధి ఉంది. ప్లాను పంపిస్తున్నాను.*

ఆగ్నేయం వీధిపోటు తల్లి అనారోగ్యానికి కారణం. ఎవరూ ఆవిడకు చేతబడి చేయలేదు. ఇంటి దేవుడి గదిలో 'నరఘోష' యంత్ర ప్రతిష్ట చేయండి.

*కె.నాదమునిరెడ్డి — చిత్తూరు*

** నాలుగైదేళ్లుగా పంట దిగుబడి తగ్గిపోయింది. తరుణోపాయం చెప్పండి?*

గృహవాస్తు చూపించుకొని లోపాల్ని సవరించుకోండి. యంత్ర ప్రతిష్ట చేసుకోండి. మీరు కుడి ఉంగరం వ్రేలికి గోమేధుక ధారణ చేయండి.

*నిప్పట్ల అరుణ — ఊటుకూరు*

** అమ్మాయి పెళ్లి చాలా ఆలస్యం అవుతోంది. పరిష్కారం చెప్పండి?*

మంచి సంబంధం కోసం ప్రయత్నించండి. పగడం ధరింపజేయండి.

*డి.వి.నారాయణ — సూళ్లూరుపేట*

** ఇల్లు కొందామంటే వాస్తు ప్రకారం బాగా లేదంటున్నారు.*

ఎలాంటి ఇళ్లయినా నిర్మాణరీత్యా సరిచేసుకోవచ్చు. అయితే వాస్తు శాస్త్రవేత్త నిష్ణాతుడై ఉండాలి.

*సి.ఉమాకాంతారావు — సికింద్రాబాద్*

** వీధిపోటు ఉన్నప్పుడు, వినాయక విగ్రహమా? యంత్రమా ఏది మేలు?*

దేనికి సంబంధించిన పూజలు దానికున్నాయి. మీరు 'యంత్రమే' ప్రతిష్టించుకోండి.

# ముంచుకొస్తున్న తాగునీటి ఎద్దడి సమస్య!

**ఎండలు ముదురుతుండడం, వేళాపాళాలేకుండా విద్యుత్ కోతలు విధిస్తుండడంతో గ్రామీణ ప్రాంతాల్లో తాగునీటి సరఫరాకు ఇబ్బందులు మొదలయ్యాయి.**

జిల్లాలో వేసవి కాలం సమీపిస్తుండడంతో తాగునీటి సమస్య ఏర్పడుతుంది. దీనికితోడు వేళాపాళాలేకుండా విద్యుత్ కోతలు విధిస్తున్నారు. దీంతో గ్రామీణ ప్రాంతాల్లో సక్రమంగా తాగునీటి సరఫరా జరగడం లేదు. గ్రామీణ నీటి సరఫరా విభాగం ఆధ్వర్యంలో తాగునీటి సరఫరా కోసం నిర్మించిన ట్యాంకులు, ఏర్పాటుచేసిన పైపులైన్లు పలు ప్రాంతాల్లో మరమ్మత్తులకు గురైనా వీటి గురించి పట్టించుకునే వారు లేకుండా పోయారు. తాగునీటికి సంబంధించిన పనులను పూర్తిచేసి వాటి నిర్వహణ బాధ్యతలను స్థానిక గ్రామ పంచాయితీలకు అప్పగిస్తారు. ఆ తర్వాత మరమ్మత్తు పనులను పంచాయితీ నిధుల నుంచే చేపట్టాల్సి ఉంటుంది. అయితే ఈ విషయమై గ్రామీణ ప్రాంతాల ప్రజలు పంచాయితీ కార్యదర్శులకు విన్నవించుకుంటున్నా స్పందించడం లేదు.

మెట్ట ప్రాంత మండలాలతోపాటు తీర ప్రాంత మండలాల్లో కూడా తాగునీటి ఎద్దడి తలెత్తుతుంది. ప్రతి వేసవి కాలంలో తాగునీటి ఎద్దడి ఏర్పడకుండా అవసరమైన ముందు జాగ్రత్తలు తీసుకోవాలని జిల్లా కలెక్టర్ ఆదేశిస్తున్నా సంబంధిత శాఖాధికారులు మాత్రం నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారు. తాగునీటి అవసరాల కోసం ప్రతి సంవత్సరం రాష్ట్ర ప్రభుత్వం కోట్ల రూపాయల నిధులు కేటాయిస్తున్నా ఆశించిన లక్ష్యాలు సాధించలేకపోతున్నారు. కొన్ని గ్రామాల్లో తాగునీటి వసతిలేక దూర ప్రాంతాల నుంచి పైపులైన్లు ఏర్పాటుచేసి సరఫరా చేస్తున్నారు. ఈ సదుపాయం ఉన్న ప్రాంతాల్లో విద్యుత్ కోతలు ఇష్టానుసారంగా అమలు చేస్తుండడంతో ఎప్పుడు తాగునీరు సరఫరా అవుతుందో తెలియక మహిళలు ఎదురు చూడాల్సిన పరిస్థితి ఏర్పడింది. పైపులైన్లు శిథిలావస్థకు చేరితే ట్రాక్టర్ల ద్వారా తాగునీటిని తాత్కాలికంగా అందించే అవకాశం ఉంటుంది.

## మునిసిపాలిటీల్లోనూ

గ్రామీణ ప్రాంతాలతోపాటు జిల్లాలోని నాలుగు మునిసిపాలిటీల్లో తాగునీటి సమస్యతో ప్రజలు ఇక్కట్లు పడుతున్నారు. నెల్లూరు నగరంలో ప్రతిరోజూ రెండు పూటలా త్రాగునీటి సరఫరా చేస్తామని అధికారులు ప్రకటించారు. అయితే కొన్ని డివిజన్లలో ఒక్క పూట, మరి కొన్ని డివిజన్లలో అసలు పూర్తిగా సరఫరా కావడం లేదు. ప్రధానంగా మహిళలు వీధి కొళాయిల వద్ద గంటల తరబడి నిరీక్షిస్తున్నారు. మునిసిపల్ అధికారులు తాగునీటి సరఫరా జరుగుతున్న తీరుపై సరైన పర్యవేక్షణ చేయకపోవడంతో కిందిస్థాయి సిబ్బంది ఇష్టానుసారంగా వ్యవహరిస్తూ ప్రజలకు ఇబ్బంది కలిగిస్తున్నారు.

కావలి మునిసిపాలిటీలో భూగర్భ జలాలు అడుగంటిపోయే పరిస్థితి ఏర్పడిందని స్థానికులు చెబుతున్నారు. ఈ ప్రాంతంలో సమ్మర్ స్టోరేజి ట్యాంకు ఏర్పాటుచేసినా కావలి పట్టణ ప్రజలకు అవసరమైన తాగునీటిని నిల్వచేసి విడుదల చేయలేకపోతున్నారని వాపోతున్నారు. గూడూరు, వెంకటగిరి మునిసిపాలిటీలలో ప్రతి సంవత్సరం ట్రాక్టర్ల ద్వారా తాగునీరు సరఫరా చేస్తారు. ఈ ప్రాంతాల్లో భూగర్భజలాలు మార్చి నెల నుంచి అడుగంటిపోతాయి. ఈ సమయంలో వాహనాల ద్వారా వచ్చే నీటిపైనే ఆధారపడాల్సి వుంటుంది.

## ఎన్నికల కోడ్ అడ్డు

తాగునీటి సమస్య పరిష్కారం కోసం పైపులైన్ల ఏర్పాటు, మరమ్మత్తులు చేపట్టేందుకు జిల్లాలో ఎన్నికల కోడ్ అడ్డుగా ఉందని అధికారులు చెబుతున్నారు. కోవూరు ఉపఎన్నిక నిర్వహిస్తున్న సందర్భంగా జిల్లా అంతటా ఎన్నికల కోడ్ అమలు చేయాలని ఎన్నికల సంఘం ఆదేశించింది. ఈ నేపథ్యంలో కొత్తగా పనులు ప్రారంభించడం, మరమ్మత్తులు చేయడం వంటి పనులు చేపట్టరాదు. ఈ నెలాఖరు వరకు ఎన్నికల కోడ్ అమల్లో ఉంటుంది.

ప్రక్కదారి మళ్లిన పథకం

# పెనుబర్తి ఉపాధి హామీ పనుల్లో అక్రమాలు!

**గ్రామానికి సమీపంలోని ఎస్ఎస్‌కెనాల్ త్రవ్వకం పనులను యంత్రాలతో చేస్తూ ఉపాధి హామీ పథకం నిధులను చెల్లిస్తున్నారు. ఈ విషయమై గ్రామస్తులు జిల్లా కలెక్టర్, డ్వామా ప్రాజెక్ట్ డైరక్టర్ దృష్టికి తీసుకెళ్లినా ప్రయోజనం లేకుండా పోయింది.**

మహాత్మాగాంధీ జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకంలో కూలీలకు బదులు యంత్రాలతో పనులు చేయిస్తున్నారు. ఈ పథకం ప్రారంభించిన దగ్గర నుంచి అవినీతి, అక్రమాలు చోటు చేసుకుంటున్నాయి. గ్రామీణ ప్రాంత ప్రజల నుంచి అక్రమాలు జరుగుతున్న తీరుపై ఫిర్యాదులు అందుతున్నా క్షేత్రస్థాయిలో పనిచేస్తున్న సిబ్బంది తీరులో ఏమాత్రం మార్పు కానరావడం లేదు. పథక సంచాలకుల పర్యవేక్షణ, తనిఖీలు సక్రమంగా లేకపోవడంతో క్రిందిస్థాయి సిబ్బంది ఇష్టానుసారంగా వ్యవహరిస్తూ అవినీతి, అక్రమాలకు పాల్పడుతున్నారు. తప్పనిసరి పరిస్థితులో బాధ్యులపై విచారణ జరిపితే రాజకీయనేతలు రంగప్రవేశం చేసి వారిని కాపాడేందుకు ప్రయత్నాలు చేస్తుంటారు. దీనికి ఉదాహరణ రాపూరు మండలం పెనుబర్తి గ్రామంలో చేపట్టిన ఉపాధిహామీ పనులను పేర్కొనవచ్చు.

## నష్టపరిహారం ఇవ్వలేదు

కండలేరు రిజర్వాయర్ నిర్మించేందుకు గ్రామాలను ఖాళీ చేయించి వేరే ప్రాంతానికి పెనుబర్తి గ్రామాన్ని తరలించారు అధికారులు. మునకప్రాంత గ్రామంగా గుర్తింపబడినప్పటికి ప్రభుత్వం నుంచి అవసరమైన నష్టపరిహారం సక్రమంగా అందించలేకపోయారు. ఇక్కడ గ్రామస్తులకు ఇంటి నివేశన స్థలాలు కేటాయించినా చదును చేసుకోలేకపోయారు. పలు దఫాలు జిల్లా కలెక్టర్, తెలుగుగంగ ప్రత్యేక కలెక్టర్‌కు సమస్యలపై విన్నవించుకున్నా క్రిందిస్థాయి అధికారుల్లో స్పందన కానరాలేదు. ఉపాధి హామీ పథకం ద్వారా గ్రామంలోని పేదలకు పనులు కేటాయించాలని నిర్ణయించారు. అయితే అర్హులైన వారికి అందించాల్సిన జాబ్ కార్డులు గ్రామంలోని కొందరు పెద్దలకు అప్పగించారు. గ్రామసభ నిర్వహించి చేపట్టాల్సిన పనులకు కూలీలను ఎంపిక చేయాల్సి వుండగా క్షేత్రస్థాయి అధికారులు నిబంధనలను తుంగలో తొక్కుతున్నారు.

## ప్రొక్లెయిన్ల ద్వారా పనులు

గ్రామంలో ఇంటి స్థలాలు, వీధుల లెవలింగ్‌ను ఉపాధిహామీ పథకం ద్వారా చేపట్టవచ్చు. సమీపంలో ఎస్.ఎస్.కెనాల్ కాలువ త్రవ్వకం పనులు జరుగుతున్నాయి. ప్రొక్లైన్ల ద్వారా బయటకు తీసిన మట్టిని ట్రాక్టర్లలో నింపి పెనుబర్తి గ్రామానికి తరలిస్తున్నారు. ఇందుకు ఉపాధిహామీ పథకం నిధులను చెల్లిస్తున్నారు. కూలీలకు పనులు కల్పించి ఉపాధి చూపించాల్సిన అధికారులు కాలువ నిర్మాణ పనుల్లో తీసిన మట్టిని ఉపాధిపనులు క్రింద చూపించడం విశేషం. ఈ విషయంపై ఇదే గ్రామానికి చెందిన గొట్టిగుండాల జానకిరామిరెడ్డి జిల్లా కలెక్టర్, డ్వామా ప్రాజెక్టు డైరెక్టర్లను కలసి వినతి పత్రాలు సమర్పించినా విచారణ జరపలేకపోయారు.

## గ్రామసభనూ నిర్వహించరు

గత నెలలో దాదాపు ఆరుసార్లు ఈ పథకం క్రింద జరుగుతున్న పనులపై గ్రామసభ నిర్వహించి ప్రజల అభిప్రాయాలను తెలుసుకోవాలని ఆయన వినతి పత్రాలు సమర్పించారు. మునక ప్రాంతవాసులు పొలాలు, ఇళ్లు సర్వస్వం కోల్పోయి వేరే ప్రాంతానికి వచ్చి నివాసాలు ఏర్పాటు చేసుకొని జీవనోపాధిలేక తీవ్ర ఇక్కట్లు పడుతున్నారు. ఇప్పటికైనా సంబంధితశాఖ అధికారులు స్పందించి మారుమూలన వున్న పెనుబర్తి గ్రామంపై ప్రత్యేక దృష్టి సారించాల్సిన అవసరం వుంది.

## అష్టకష్టాలు పడ్డాను!



నా గూర్చి ఇప్పుడంతా గొప్పగా మాట్లాడుకోవచ్చు. కానీ ఇప్పటికీ నేను నడిచిన దారి నాకు బాగా గుర్తు. అడుగడుగునా కష్టాలు ఎదుర్కొన్నాను. శక్తిమేర శ్రమించాను. ఎలాంటి ఫలితం ఎదురైనా స్వీకరించానంటుంది బాలీవుడ్‌లో ప్రస్తుతం నెంబర్ వన్ హీరోయిన్ కత్రినా కైఫ్. ఈ విషయాన్ని వివరిస్తూ చిత్రసీమకొచ్చిన తొలినాళ్లలో రకరకాల పరాభవాలు ఎదురయ్యాయి. నటించిన సినిమాలన్నీ ఫ్లాప్ అయ్యాయి. చాలా మంది కత్రినకు నటన, డ్యాన్స్ రావన్నారు. కానీ నేను నిరుత్సాహపడలేదు. వెనకడుగు వేయలేదు. రోషం కొద్దీ నటన, డ్యాన్స్ మెరుగుపరచుకొన్నాను. ఇప్పుడందరూ నా నటన, నేను నర్తించిన పాటలు షీలాకీ జవానీ, చిక్నీ చమేలీ గూర్చి మాట్లాడుతుంటే బాధ, ఆనందం రెండూ కలుగుతుంటాయంది.

## అమ్మాయ్... కాస్త తగ్గు!

దర్శకుడు రాజమౌళికి ఓపిక జాస్తి. తన సినిమా షూటింగులతో ఎంతో బిజీగా ఉన్నా విడుదలైన ప్రతి సినిమాను చూస్తుంటారాయన. ఈ మధ్య వచ్చిన ఇష్క్, పూలరంగడు సినిమాలు బాగా నచ్చాయని తన ట్విట్టర్‌లో వ్రాసుకొన్నారాయన. దీనిలోనే హీరోయిన్ నిత్యమీనన్‌పై ఒక కామెంట్ చేశారు. ఇష్క్‌లో పి.సి. శ్రీరాం కెమెరా అద్భుతం. నిత్యమీనన్ బాగా నటించింది. అందంగా కూడా ఉంది. కానీ బాగా ఒళ్లు చేసింది. కొంచెం తగ్గితే బాగుంటుందన్నారాయన. ఈ సలహా నిత్యమీనన్‌కు నచ్చుతుందో... నొచ్చుతుందో తెలియదు.



## ఆయనిలా ఉండాలి!

కష్టపడి పైకొచ్చే వారంటే తనకు చాలా ఇష్టమంటుంది హీరోయిన్ శ్రియ. అలాంటి వ్యక్తుల్ని ప్రేమిస్తా. నాకు కాబోయే భర్త కూడా అలాగే ఉండాలి. కుటుంబం, విలువలు, స్నేహం... ఇలాంటి విషయాలకు విలువ ఇవ్వాలి. ఎలాంటి విషయాన్నైనా తేలిగ్గా తీసుకోవాలి. అలాంటి వ్యక్తినే భాగస్వామిగా స్వీకరిస్తానంటుంది. తెలుగులో నువ్వా-నేనా చిత్రంలో నటిస్తున్న శ్రియ బాలీవుడ్‌పై ఇంకా ఆశలు వదలుకోలేదంటుంది. అక్కడ ఏదో ఒక రోజు తనను వెతుక్కుంటూ మంచి అవకాశాలు వస్తాయని ఎదురు చూస్తోంది.



## డబ్బుకోసం రాలేదు



సినిమా అనేది కళ. దానిపై మమకారం ఉంటేనే నటనలో సహజత్వం ఉంటుంది. తెరపై కనిపించి ప్రేక్షకుల్ని మెప్పించగలుగుతాం. అతి కొద్ది మందికి మాత్రమే వచ్చే ఈ అవకాశాన్ని డబ్బుతో ముడిపెట్టడం సరైందికాదని చెబుతోంది హీరోయిన్ తాప్సి. ఓ మంచి పాత్ర, ఊహించని పారితోషికం ఈ రెండు విషయాల్లో నిర్ణయం తీసుకోవాల్సి వస్తే మీరేం చేస్తారు? అని అడిగితే ఎప్పుడూ నా ప్రాధాన్యత మంచి పాత్రలకే అంది. ఈ విషయమై వివరిస్తూ నేను సినిమా రంగంలోకి వచ్చింది కేవలం డబ్బు సంపాదించడానికే కాదు. అందుకైతే బోలెడన్ని మార్గాలున్నాయి. సినిమాపై ప్రేమతో, ఓ మంచి హీరోయిన్‌గా నిరూపించుకోవాలనే తపనతోనే ఇక్కడికి వచ్చాను. లేదంటే సాఫ్ట్‌వేర్ రంగంలో స్థిరపడి ఉండేదాన్ని. కళను నమ్ముకున్నాను కాబట్టి తక్కువ కాలంలోనే మంచి పేరొచ్చిందంది.

## బాద్‌షాగా ఎన్టీఆర్!

దూకుడు సినిమాతో వసూళ్ల వర్షం కురిపించిన దర్శకుడు శ్రీనువైట్ల. ఆ సినిమాతో మహేష్‌బాబు వసూళ్ల బాద్‌షా అయిపోయాడు. శ్రీనువైట్ల మరో బాద్‌షాను చూపించనున్నారు. ఎన్టీఆర్ – శ్రీనువైట్ల కలయికలో ఓ చిత్రం రూపుదిద్దుకోనుంది. కాజల్ కథానాయిక. బృందావనం తర్వాత వీరిద్దరూ జోడీకట్టిన చిత్రమిదే. ఈ తాజా చిత్రానికి 'బాద్‌షా' అనే పేరు ఖరారు చేశారు. ఇదివరకు యాక్షన్ అనే పేరును పరిశీలించారు. అయితే చిత్ర బృందం బాద్‌షావైపే మొగ్గుచూపినట్లు తెలిసింది. ఈ చిత్రాన్ని బండ్ల గణేష్ నిర్మిస్తున్నారు. స్క్రిప్టు పనులు పూర్తయ్యాయి. ఏప్రెల్‌లో సెట్స్ మీదకు వెళ్లనుంది.

## చరణ్ జంజీర్‌లో సంజయ్‌దత్



అమితాబ్ బచ్చన్ నటించిన జంజీర్ చిత్రాన్ని రామ్‌చరణ్ హీరోగా తెలుగు, హిందీ భాషల్లో రీమేక్ చేయనున్నారు. ఈ చిత్రం ఏప్రెల్ 20వ తేదీ ప్రారంభమవుతుంది. ఈ సినిమాలో షేర్‌ఖాన్ పాత్ర చాలా ముఖ్యమైనది. గతంలో ప్రాణ్ నటించారు. రీమేక్‌లో సంజయ్‌దత్‌ను నటించమని అడిగారని భోగట్టా. ఇటీవలే సంజయ్‌దత్ 'అగ్నిపథ్'లో విలన్‌గా నటించి మెప్పించాడు. ఆయిల్ మాఫియా నేపథ్యంలో సాగే ఈ సినిమాకు నిర్మాత అమిత్‌మెహ్రా, దర్శకుడు అపూర్వలిఖియా.

## రేటు పెంచిన ధనుష్

తమిళ హీరో ధనుష్ ఇంట్లో అదృష్ట దేవత తిష్టవేసినట్లుంది. గత ఏడాది 'ఆడు కలమ్' సినిమాతో జాతీయ అవార్డు అందుకొన్నాడు. ఆయన పాడిన 'కొలవెరి' పాట ప్రపంచాన్ని వెర్రి ఎక్కించింది. దీంతో ధనుష్‌కు బాలీవుడ్ అవకాశాలు తలుపుతట్టాయి. ఒక్కసారి నాలుగు సినిమాల్లో నటించమని ఆఫర్లు రాగా పాటలు పాడమని పది మంది చిత్ర నిర్మాతలు చెన్నై వచ్చి మరీ అడిగారట. డిమాండ్ చూసిన ధనుష్ తన పారితోషికం ఐదు కోట్ల నుంచి 15 కోట్లకు పెంచేశాడు. హిందీ నేర్చుకొంటున్నాడీయన. నేర్చుకొని నటించేసరికి ఆ డిమాండ్ కాస్త తగ్గిపోతుందని తమిళ నిర్మాతలు సణుగుతున్నారు.



## నేనేమిటో చూపిస్తా!

సినిమా అంతా నేనే కనిపించాలని లేదు. నాతోపాటు ఇద్దరు హీరోయిన్లున్నా పర్వాలేదు. అలాంటి సినిమాల్లోనూ నా ప్రతిభ ఏమిటో చూపిస్తా అంటోంది కంగనా రనౌత్. తెలుగులో 'ఏక్ నిరంజన్' సినిమాలో చేసిన ఈ భామ ప్రస్తుతం హిందీ చిత్రాల్లోనే నటిస్తుంది. ఇటీవల హైదరాబాద్ వచ్చిన ఆమె మాట్లాడుతూ సినిమాలో ఒకే హీరోయిన్ ఉండాలనే నియమం లేదు. ఇద్దరు ముగ్గురున్నా తప్పులేదు. బాలీవుడ్‌లో మల్టీస్టారర్ హవా కొనసాగుతోంది. ఇలాంటి పరిస్థితుల్లో కథానాయిక పాత్ర మరొకరితో పంచుకోవాల్సిందే నంది. క్రిష్-3 సినిమాలో ఈ అమ్మడికి మంచి పాత్ర దక్కిందట. దాని గూర్చి చెబుతూ హృతిక్‌రోషన్ లాంటి అందగాడితో కలిసి నటించడం చాలా ఆనందంగా ఉంది. అయితే ఇందులో నా పాత్రకు ప్రతి నాయిక లక్షణాలు ఆపాదించారు. దీనివల్ల బాక్సింగ్, కుంగ్‌ఫూ, కరాటేలాంటి విన్యాసాలు కూడా ప్రదర్శిస్తానంది.



● డాక్టర్ కిషోర్ రత్నం

# జెన్ నెక్ట్స్ స్కూల్ ఘనత!



సమావేశంలో మాట్లాడుతున్న రత్నం విద్యాసంస్థల జనరల్ మేనేజర్ రామ్మూర్తినాయుడు.

న్యూఢిల్లీలోని ఎన్‌సిఇఆర్‌టి సంస్థ గత ఏడాది నవంబర్‌లో ఎనిమిదవ తరగతి చదువుతున్న విద్యార్థులకు నిర్వహించిన ఎన్‌టిఎస్‌ఇ పరీక్షలో నెల్లూరు సరస్వతినగర్‌లోని డాక్టర్ కిషోర్స్ రత్నం జెన్‌నెక్ట్స్ స్కూల్ విద్యార్థులు 17 మంది ఎంపికయ్యి తమ సత్తా చాటారు. ఈ సందర్భంగా స్కూల్ ప్రాంగణంలో విద్యాసంస్థల జనరల్ మేనేజర్ రామ్మూర్తినాయుడు విలేకరుల సమావేశం ఏర్పాటుచేసి మాట్లాడారు. ఎన్‌టిఎస్‌ఇ పరీక్ష ప్రథమదశ ఫలితాల్లో రాష్ట్రంలోనే 17 మంది విద్యార్థులు పాసైన విద్యాసంస్థ మరొకటి లేదు. జిల్లా నుంచి 26 మంది విద్యార్థులు ఈ పరీక్షలో విజేతలుగా నిలిస్తే వారిలో 17 మంది డాక్టర్ కిషోర్స్ రత్నం జెన్ నెక్ట్స్ స్కూల్ విద్యార్థులేనన్నారు. పరీక్షలకు హాజరైన విద్యార్థుల కోసం స్కూల్స్ డైరక్టర్ డాక్టర్ కృష్ణకిషోర్ స్వయంగా రూపొందించిన మెంటల్ ఎబిలిటీ మెటీరియల్, ప్రశ్నాపత్రాలు, కౌన్సిలింగ్ ఎంతగానో దోహదపడ్డాయన్నారు. ఈ 17 మంది విద్యార్థులకు ఒక్కొక్కరికి ఐదువేల రూపాయల చొప్పున డాక్టర్ కిషోర్ ప్రోత్సాహక బహుమతందించారన్నారు. ఈ సమావేశంలో విద్యాసంస్థల ప్రిన్సిపాళ్లు మైకేల్ సుకుమార్. మనోజ్, సంయుక్త, తుహీనా, సుప్రియ, మేనేజర్ రాజేష్‌బాబు పాల్గొన్నారు.

## పట్టణ ఆరోగ్య కేంద్రాలకు నిధులు!

జిల్లాలోని పట్టణ ఆరోగ్య కేంద్రాలు నిధులు లేక అభివృద్ధికి నోచుకోలేక పోతున్నాయి. అయితే వీటిని అభివృద్ధి పరచేందుకు ప్రభుత్వం నిధులు మంజూరు చేయడం జరిగింది. ఈ నిధులతో ఆరోగ్య కేంద్రాలు అవసరమైన మౌలిక వసతులు సమకూర్చుకోవచ్చు. జిల్లావ్యాప్తంగా నాలుగు పట్టణ ఆరోగ్య కేంద్రాలున్నాయి. ఒక్కోదానికి మూడు లక్షల రూపాయల చొప్పున ప్రభుత్వం కేటాయించింది. ఖజానా కార్యాలయం నుంచి నిధులు విడుదల చేసేందుకు ఎన్నికల కోడ్ అడ్డుగా ఉంది. కోవూరు ఉప ఎన్నిక ముగిసిన తర్వాత నిధులు డ్రా చేస్తారు. గతంలో ఆరోగ్య కేంద్రాలకు విడుదల చేసిన నిధులు సక్రమంగా వినియోగించలేదన్న ఆరోపణలున్నాయి. ఈ కేంద్రాల అభివృద్ధి కమిటీ ఆధ్వర్యాన నిధులను ఖర్చు చేయాలన్నది ప్రభుత్వ అభిప్రాయం. కొందరు వైద్యులు ఇష్టానుసారంగా వ్యవహరిస్తున్నారు.

# ఇంటర్ విద్యార్థులకు ఎన్ని అవస్థలో...

## ● పరీక్ష కేంద్రాల్లో వసతులలేమి

జిల్లాలో ఇంటర్మీడియట్ పరీక్షలు వ్రాసే విద్యార్థులు తీవ్ర అగచాట్లు పడుతున్నారు. కనీస సౌకర్యాలకు నోచుకోక, పట్టించుకునే అధికారే లేక, కూర్చునేందుకు తగిన వసతి లేక పలు సమస్యల నడుమ పరీక్షలు వ్రాస్తున్నారు. జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి ఈ సారి పరీక్షల్లో విద్యార్థులెవరూ నేల మీద కూర్చొని పరీక్షలు వ్రాయడానికి వీలులేదని అందరికీ తగిన ఫర్నిచర్ సౌకర్యం కల్పించాలని లేకపోతే సంబంధిత చీఫ్ సూపరింటెండెంట్లు, డిపార్టుమెంటల్ అధికారులపై చర్యలు తప్పవని హెచ్చరికలు జారీచేసినా అదెక్కడా అమలు కాకపోవడం అధికారులకు విద్యార్థుల పట్ల ఉన్న శ్రద్ధ ఏపాటిదో, కలెక్టర్ ఆదేశాలను ఏమాత్రం గౌరవిస్తున్నారో అర్థమవుతోంది. పరీక్ష వ్రాసేందుకు వీలుగా తగిన కుర్చీలు లేక, బెంచీలు ఉన్నా విరిగిపోయి ఉండడంతో పలు పరీక్ష కేంద్రాలలో విద్యార్థులు కన్నీటి పర్యంతం అయ్యారు. దీనికంటే క్రింద కూర్చొని వ్రాయడం సౌకర్యంగా ఉంటుందని అధికారులు నిర్లక్ష్యంగా వ్యవహరించారని విద్యార్థులు వాపోయారు. ముఖ్యంగా వివిధ పరీక్ష కేంద్రాల చిరునామాలు విద్యార్థులను గందరగోళ పరిచాయి. రికార్డుల్లో కళాశాల పేరు ఒకటిగా ఉండడం, ప్రస్తుతం వేరే యాజమాన్యం కళాశాలను నిర్వహిస్తుండడంతో హాల్ టిక్కెట్లు ఇచ్చిన అడ్రస్ ఎక్కడో తెలియక పలువురు విద్యార్థులు పడిన ఇబ్బందులు అన్నీ ఇన్నీ కావు. కనీసం బోర్డును అందరికీ కన్పించేలా ఏర్పాటు చేయడంలో కళాశాలలు తగిన జాగ్రత్తలు తీసుకోకపోవడం పిల్లలపాలిట శాపమైంది. మరోవైపు కార్పొరేట్ కళాశాలలు విద్యార్థుల వద్ద నుంచి పరీక్ష కేంద్రాలకు వాహన సౌకర్యం పేరుతో వందలాది రూపాయలను ముక్కుపిండి వసూలు చేశాయి. వీరు ఏర్పాటుచేసిన బస్సులు సకాలంలో పరీక్షా కేంద్రాలకు చేరకపోవడం వల్ల విద్యార్థులు కన్నీళ్ల పర్యంతం అయ్యారు. పరీక్ష సెంటర్లకు ప్రశ్నాపత్రాలను ఎటువంటి భద్రత లేకుండా హడావుడిగా తీసుకెళ్లడం చాలా చోట్ల కన్పించింది. ఈ హడావుడిలో ఎనిమిది గంటలకు విద్యార్థులకు ఇవ్వాల్సిన ప్రశ్నాపత్రాలను ఇవ్వని సెంటర్లు కూడా ఉన్నాయి. కానీ 11 గంటలకే సమాధాన పత్రాలు లాక్కొన్నారని విద్యార్థులు లబోదిబోమన్నారు. విద్యుత్‌కోత, మంచినీటి సౌకర్యం, మరుగుదొడ్ల సౌకర్యంలేని కాలేజీల్లో పరీక్షా కేంద్రాలను ఏర్పాటు చేయడం వల్ల విద్యార్థులు పడరాని పాట్లుపడ్డారు. ఇరవై నాలుగు పేజీల సమాధాన పత్రం ఇవ్వడంతో సంస్కృతం, తెలుగు, ఇంగ్లీషు పరీక్షలను వ్రాయను కొందరు విద్యార్థులు ఇబ్బందులు పడ్డారు. ఇన్ని అగచాట్లు, అసౌకర్యాల నడుమ విద్యార్థులు పరీక్షలు వ్రాయాల్సి వచ్చింది.

# కోవూరు ప్రజల పరువు ప్రతిష్టలు పెంచుతాను!

జిల్లా తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డిని అలుపెరగని పోరాట యోధుడని చెప్పొచ్చు. గడచిన ఎనిమిదేళ్ల కాంగ్రెస్ పాలనలో తెలుగుదేశం పార్టీలోని నాయకులు, కార్యకర్తలంతా తలా ఒక దిక్కు చెల్లాచెదరైనా మళ్లీ వారందరినీ ఒక చోట చేర్చి తానొక్కడే జిల్లా పార్టీ బరువు బాధ్యతలు మోస్తున్నాడు. రాష్ట్రస్థాయికి ఎదిగే అవకాశం, అర్హత పుష్కలంగా ఉన్న జిల్లాలోనే ఉండి పార్టీకి పునర్ వైభవం కల్పించాడు. ప్రజా సమస్యలపై రాత్రి పగలు తేడా లేకుండా గడపడం చంద్రమోహన్‌రెడ్డికి అలవాటు. తన మామ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి నుంచి సంక్రమించిన వారసత్వ లక్షణమిది. విచిత్ర రాజకీయ పరిణామాల నేపథ్యంలో సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి ఒకప్పుడు తాను టిక్కెట్ ఇప్పించి గెలిపించి ఎమ్మెల్యే, ఆ తర్వాత మంత్రిని చేసిన మామ కొడుకు ప్రసన్నకుమార్‌రెడ్డిపై కోవూరు ఉప ఎన్నికల్లో ప్రత్యర్థిగా తలపడుతున్నారు. తెలుగుదేశం పార్టీ సర్వాధినేత నారా చంద్రబాబునాయుడు కూడా ఎన్నికల ప్రచారంలో భాగంగా కోవూరు నియోజకవర్గంలో జరిగిన ప్రచార సభల్లో రాజకీయాల్లో నీతి నిజాయితీగా వ్యవహరించే వ్యక్తి ఈ రోజుల్లో దొరకడం గగనమని, అవినీతి అక్రమాలపై అలుపెరుగని పోరాటం చేసే చంద్రమోహన్ రెడ్డిని గెలిపించి అసెంబ్లీకి పంపమని ప్రజలకు సలహా ఇచ్చారు. హోరాహోరీగా జరుగుతున్న కోవూరు ఉప ఎన్నిక సంగ్రామంలో తనను కోవూరు ప్రజలు ఓటు వేసి గెలిపిస్తే వారి గౌరవం, పరువు ప్రతిష్టలు పెరిగేలా మసలుకొంటానని, వారు ఎదుర్కొంటున్న సమస్యలు పరిష్కరిస్తానని చంద్రమోహన్‌రెడ్డి 'జమీన్‌రైతు' విలేఖరికి ఇచ్చిన ప్రత్యేక ఇంటర్వ్యూలో చెప్పారు. దానిలోని ముఖ్యాంశాలివి.

*ప్రశ్న : కోవూరులో ఎందుకు పోటీచేస్తున్నారు?*

**జవాబు :** ప్రసన్నకుమార్‌రెడ్డిని తెలుగుదేశం పార్టీ నాలుగుసార్లు కోవూరు ఎమ్మెల్యేను చేసింది. కానీ ఆయన 2009 ఎన్నికల తర్వాత డబ్బు ఆకర్షణకు అమ్ముడుపోయిన ప్రసన్న రాజకీయ భిక్ష పెట్టిన తెలుగుదేశం పార్టీని విమర్శిస్తున్నారు. ఏనాడు ఆయన ప్రజల కోసం పనిచేయలేదు. స్వంత లాభం కోసం వెంపర్లాడడం ఎక్కువయ్యింది. పార్టీ ప్రతిష్ట నిలపమని చంద్రబాబునాయుడు గారు కోరినమీదట కోవూరులో నేను పోటీచేస్తున్నాను.

*ప్రశ్న : గెలిస్తే ఏం చేస్తారు?*

**జవాబు :** నీతినిజాయితీగా ప్రజల కోసం పనిచేస్తాను. ఎమ్మెల్యే పదవిని తాకట్టు పెట్టను. కోవూరు ప్రజల గౌరవాన్ని కాపాడుతూ ప్రజల వాణిని అసెంబ్లీలో వినిపిస్తాను.

*ప్రశ్న : మీ ప్రత్యర్థి ప్రచారాన్ని ఏవిధంగా ఎదుర్కొంటారు?*

**జవాబు :** ప్రసన్నకుమార్‌రెడ్డి నాలుగు సార్లు కోవూరు ఎమ్మెల్యేగా పనిచేశారు. మంత్రిగా కూడా ఉండినారు. ఇప్పుడేమో తనను చూసి కాదు వైఎస్ జగన్మోహన్‌రెడ్డిని చూసి ఓటెయ్యమంటున్నాడు. ఇంతకంటే సిగ్గు చేటైన విషయం మరొకటి లేదు. రాజశేఖర్‌రెడ్డి, జగన్ నిర్వాకాలతోపాటు ప్రసన్న అవకాశవాద రాజకీయాలను కోవూరు ప్రజలకు తెలియజేసే పనిలో ఉన్నాం.

*ప్రశ్న : మీకెందుకు ఓటు చేయాలి?*

**జవాబు :** జిల్లాలో ప్రతిపక్ష నేతగా గతంలోనూ ఇప్పుడు ఎన్నో పోరాటాలు చేశాను, చేస్తున్నాను. ఒకప్పుడు సారా వ్యతిరేక ఉద్యమానికి నాయకత్వం వహించి పోరాడాను. గతంలో కడప జిల్లాకు అక్రమంగా సోమశిల జలాలు తరలిస్తుండగా జిల్లాలోని రైతులకు బాసటగా నిలిచి ఆమరణ నిరాహారదీక్ష చేశాను. తీరప్రాంతంలో ఇబ్బడిముబ్బడిగా పెడుతున్న ధర్మల్ విద్యుత్ కేంద్రాల వల్ల ఏర్పడే కాలుష్యం, ఇతర ఇబ్బందులపై అన్ని పార్టీలతో కలసి ఉద్యమించాను. సమైక్యాంధ్ర ఉద్యమంలో తెరాస నేత కె.చంద్రశేఖర్ రావును ధీటుగా ఎదుర్కొన్నాను. కానీ ఆయన పార్టీతోనే ప్రస్తుతం వైఎస్ జగన్మోహన్‌రెడ్డి పార్టీ కుమ్మక్కయ్యింది. అటువంటి వైకాపా తరపున నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి పోటీచేస్తున్నాడు. అవినీతిపరులకు బుద్ధిచెప్పను కోవూరు ప్రజలు నావైపు నిలబడతారన్న ఆత్మవిశ్వాసం నాకు ఉంది.

*ప్రశ్న : కోవూరు ప్రజల స్పందన ఎలా ఉంది?*

**జవాబు :** నియోజకవర్గంలోని ఏ గ్రామానికి ప్రచారం చేయను వెళ్లినా ప్రజలు బ్రహ్మరథం పడుతున్నారు. స్త్రీలు, పురుషులు, యువకులు అన్న తేడా లేకుండా ఎదురేగి స్వాగతం పలికి ఆదరిస్తున్నారు.



సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి

*ప్రశ్న : మీ తరపున చంద్రబాబునాయుడు విస్తృతంగా ప్రచారం చేస్తున్నారే?*

**జవాబు :** కోవూరు నియోజకవర్గం తెలుగుదేశం పార్టీకి కంచుకోట. చంద్రబాబునాయుడు గారు ఒకసారి నియోజకవర్గంలో కలియ తిరిగితే కార్యకర్తల్లో ఎక్కడ లేని ఉత్సాహం వస్తుంది. ప్రసన్నకుమార్‌రెడ్డి చేసిన నిర్వాకాలు ఆయన సభల్లో చెబుతుంటే జనం శ్రద్ధగా ఆలకిస్తున్నారు. ఎండల్లోనూ భారీ సంఖ్యలో జనం రోడ్‌షోలకు వస్తున్నారు. ఇదే తెలుగుదేశం పార్టీ గెలుపుకు నిదర్శనమని చెప్పొచ్చు.

## ఆరాటంలో మూడు పార్టీలు

16వ పేజీ కొరవ

తున్నాయి వారికి. అయితే చంద్రమోహన్‌రెడ్డి ఘటనా ఘటన సమర్థుడు. ఎన్నికల నిర్వహణ ఆయనకు కొట్టిన పిండి. ఆ అనుభవంతో పార్టీ పరంగా వున్న లోపాలను సరిదిద్దుకోవడానికి అహో రాత్రులు శ్రమిస్తున్నాడు. తిండి నిద్ర మరిచిపో యాడు. కాంగ్రెస్ అభ్యర్థి పోలంరెడ్డి శ్రీనివాసులు రెడ్డి ఎందువల్లనో ఆశించిన స్థాయిలో తమ కార్య కర్తలను ఉత్సాహపరచలేక పోతున్నాడని చెప్పవచ్చు. ఆయన తరపున మండలానికొక ఎమ్మెల్యే స్థాయి కాంగ్రెస్ నేత, నియోజకవర్గం మొత్తం మీద ముగ్గురు మంత్రులు అందుబాటులో వున్నప్పటికీ గ్రామా లలో కాంగ్రెస్ కార్యకర్తలు మాత్రం ఏదో అసంతృ ప్తితో సతమతమౌతున్నారు.

### డబ్బులోనూ జగనే ముందంజ

ఇక డబ్బు పరంగా చూస్తే, ఇక్కడ జగన్ పార్టీయే ముందంజలో వుంది. అభ్యర్థి ప్రసన్న కుమార్‌రెడ్డితో సంబంధం లేకుండా జగన్ మీద అభిమానం వున్న యువకులు తమ జేబులో నుంచి ధారాళంగా డబ్బు తీసి వెదజల్లుతున్నారు. మసీ దులు, దేవాలయాల హామీలు గుప్పిస్తున్నారు. త్రాగిన వాడికి త్రాగినంత మందు పోస్తున్నారు. ప్రచారానికి వచ్చే జనానికి రోజుకు రెండు వందల రూపాయల కూలి లెక్క పెట్టి ఇస్తున్నారు. ఆ స్థాయిలో కాక పోయినా తెలుగుదేశం పార్టీ కూడా డబ్బులో వెనుకడుగు వేయడం లేదు. ఎవరైనా ముందుకు వచ్చి, మా కాలనీ ఓట్లన్నీ వేయిస్తాము, ఇంత మొత్తం ఇవ్వండి అని అడిగితే రెండో ఆలో చన లేకుండా ఒప్పందాలు చేసుకొంటున్నారు తెలుగుదేశం నేతలు. కాంగ్రెస్‌లో మాత్రం ఇప్పటి వరకు ఈ ధన వ్యయం కన్పించడం లేదు. చివరి దశలో ముఖ్యమంత్రి నుంచి పెద్ద పెద్ద మొత్తాలు వస్తాయి, అప్పుడు తతిమా ఇద్దర్నీ వెనక్కు నెట్టి, తాము ముందు మిగులుతాము అనే ధీమాతో వున్నారు కాంగ్రెస్‌వాదులు.

## ఫలితాన్ని నిర్ణయించేది బీసీలే

మొదటి పేజీ కొరవ

కంటే అధికంగా వున్నారు.

ఈసారి బలిజ కులంలో కాంగ్రెస్ అభిమానం అధికమన్న వాదన ఒకటి వినవస్తున్నది. కోవూరు నియోజకవర్గంలో వారు దాదాపు 6శాతం వరకు వున్నారు.

వైఎస్ ప్రవేశపెట్టిన విద్యార్థుల ఫీజు చెల్లింపు పథకంతో బాగా లబ్ది పొందినవారిలో ముస్లింలను ప్రధానంగా చెప్పుకోవచ్చు. వారందరూ జగన్‌కు ఓటు వేయడం ద్వారా తమ కృతజ్ఞత వెల్లడిస్తే, దాదాపు ఆరున్నర శాతం ఓట్లు ఆయనకు దక్కుతాయి.

పట్టపు కాపులు 4శాతం వరకు వున్నారు. వారిలో తెలుగుదేశం మోజు కన్పిస్తున్నది. అదే ధోరణిలో వున్న మాదిగల సంఖ్య కూడా దాదాపు ఐదున్నర శాతం.

మొత్తం మీద చూస్తే ఈ ఎన్నికలలో ఫలి తాన్ని నిర్ణయించేది బిసి కులాల వారే అనడం సందేహం లేని నిజం. మొదట మొదట వారిలో కూడా జగన్ మోజు కన్పించింది. అయితే రాను రాను అది తగ్గు ముఖం పడుతున్నది. ఆ మార్పు ఎంత వరకు అన్న దానిపై అభ్యర్థుల జాతకాలు ఆధారపడి వుంటాయి.

## జనవాణి

2వ పేజీ కొరవ

ఎమ్పీలున్నారు. ప్రతి సంవత్సరం రైల్వే బడ్జెట్ సమ యంలో కాస్త చర్చ జరగడం, గమ్మునైపోవడం రివా జుగా మారింది. రైల్వేమంత్రులవుతున్న బెంగాల్, బీహార్, మహారాష్ట్ర, తమిళనాడు ప్రాంతీయులు తమ రాష్ట్రాభివృద్ధికి పాటుపడ్డారు. రేణిగుంట రైల్వే కోచ్ ఫ్యాక్టరీ... స్థాపించినప్పుడు ఎట్లా వుందో ఇప్పుడూ అంతే. బిట్రగుంట లోకోషెడ్డు అభివృద్ధిని మరచిపోయారు.

*సత్యనారాయణజెట్టి* — *వెంకటగిరి*

### నెల్లూరు పోలీసులు అభినందనీయులు

పోలీసులు తాము అనుసరించే వైఖరి వల్ల నిత్యం విమర్శలపాలవుతుంటారు. కాని ఎస్పీ రమణకుమార్ నెల్లూరు బోడిగాడి తోటలో సమా ధుల మధ్య సహజీవనం సాగించే పిల్లలను చేరదీసి వారికి విద్యాబుద్ధులు నేర్పించను చేస్తున్న కృషి అభి నందనీయం. వీధిబాలల కోసం నిర్వహిస్తున్న ఈ స్కూల్ మంచి చెడ్డలను ఎస్పీ నిరంతరం పరిశీ లిస్తుండడం బట్టి దేశంలోనే ఈ స్కూల్ నెల్లూరు పోలీసుల ప్రతిష్ట పెంచుతుంది. నెల్లూరు పోలీ సులు నిత్యం ప్రజల కోసం ఇటువంటి మంచి కార్య క్రమం ఒకదాన్ని చేపట్టమని నా సలహా.

*ఎ.శౌరి* — *నెల్లూరు*

### గ్యాస్ సకాలంలో ఇవ్వడం లేదు!

ముత్తుకూరులోని ఆదిత్య ఇండియన్ గ్యాస్ ఏజన్సీ నిర్వాహకులు గ్యాస్ సిలిండర్లను సకాలంలో వినియోగదారులకు ఇవ్వక ఇబ్బందులు పెడుతు న్నారు. గ్యాస్ బుక్ చేసిన తర్వాత 15 రోజులకు ఇస్తామని చెప్పి 40 రోజులైనా ఇవ్వడం లేదు. తోటపల్లి గూడూరు మండలం మాచర్లవారిపాళెంకు గ్యాస్ ఆటో వచ్చి 24రోజులవుతోంది. పౌరసరఫ రాల శాఖాధికారులు ఈ వ్యవహారమై కలుగజేసు కొని ప్రజలకు గ్యాస్ సిలిండర్ల కష్టాల నుంచి విముక్తి కల్గించాల్సి వుంది.

*పి.కృష్ణమూర్తి* — *మాచర్లవారిపాళెం*

### ఏం ప్రభుత్వాలు?

ఈనాటి పిల్లలే రేపటి భావిభారత పౌరులు. దేశ భవిష్యత్తు యావత్తూ పిల్లలపై ఆధారపడి వుంది. వారి ప్రగతికి ఎలాంటి అవరోధం కలగ కుండా చూసుకోవాల్సిన బాధ్యత మనందరిది. పిల్లల ఉజ్వల భవిష్యత్తుకు బంగారు బాటలు వేసేలా భారత రాజ్యాంగం వారికి కొన్ని హక్కుల్ని ప్రసాదిం చింది. దశాబ్దాలుగా దేశంలో బాలలకు సంబం ధించి పౌష్టికాహార లోపాలు కొనసాగుతూనే వున్నాయి. పౌష్టికాహార లోపం అనేది జాతిని పీడి స్తున్న సమస్యగా పాలకులు గుర్తించినా, ఎప్పటి కప్పుడు హామీలు గుప్పిస్తూ ఆ తర్వాత సమస్యను పట్టించుకోకుండా దాటవేత ధోరణిలో పాలన సాగి స్తున్నారు. తాజా నివేదిక ప్రకారం దేశంలో 42 శాతం మంది పిల్లలు బరువు తక్కువగా పుట్టడం, పౌష్టికాహార లోపాలతో పిల్లలు మృత్యువాతపడడం సిగ్గుచేటు. అధికారంలోని ప్రభుత్వాలు ఈ వ్యవహా రంలో బధిరుల మాదిరి వ్యవహరించడం బాధాకరం.

*షేక్ దస్తగిరి అహ్మద్* — *నెల్లూరు*



**కొడవలూరులో వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ అభ్యర్థి నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి తరపున ప్రచారం చేస్తున్న ఆ పార్టీ రాష్ట్ర అధ్యక్షుడు జగన్మోహన్‌రెడ్డి. చిత్రంలో తాజా మాజీ ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి వున్నారు.**

## టెక్నాలజీతో ఇబ్బందులు!

నేరాల సంఖ్య పెరగటానికి ప్రధాన కారణం ఇంటర్నెట్ మరియు సెల్‌ఫోన్‌ల వినియోగం పెరగ టమే. వీటిలో విచ్చలవిడి శృంగార దృశ్యాలు చాలా సునాయాసంగా లభిస్తున్నాయి. వీటివల్ల యువత పెడదారి పడుతోంది. విలాసాల మత్తులో, జల్సాల కోసం నేరాలు చేయటానికి వెనుకాడడం లేదు. ఈ మధ్యకాలంలో నేరాలు చేసి పట్టుబడుతున్న వారిలో ఎక్కువగా చదువుకుంటున్న యువకులే వుంటున్నారు. ఆస్తి తగాదాలు, భార్యాభర్తల చావులకు పోలీసు లను బాధ్యులను చేయలేంగాని వారు సత్వరం స్పం దించకపోవడం వల్ల నేరాలు పెరుగుతున్నాయి. శాంతిభద్రతలను కాపాడవలసిన బాధ్యత రక్షక భటు లదే. కురచ దుస్తుల వల్ల అత్యాచారాలు, ఇంట్లో ఎవరూ లేనందువల్ల దొంగతనాలు, బంగారు నగలు ధరించారని చైన్ స్నాచింగ్‌లు, మద్యం దుకాణాలు న్నాయి కాబట్టి రోడ్డు ప్రమాదాలు జరుగుతున్నా యని, ఇందులో మా బాధ్యత ఏమిటని చెప్పి పోలీ సులు తప్పించుకోవడం కుదరదు.

*పి.అరుణకుమారి* — *నెల్లూరు*

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

కుండా సెల్యూట్‌చేసి పంపిన పోలీసులపై ఎన్నికల కమిషన్ చర్యలు చేపట్టింది. ఇందుకూరుపేట మం డలం పల్లిపాడు వచ్చిన మంత్రి వాహనాలను తనిఖీ చేయకుండా అధికంగా వాహనాలను పంపడంతో ప్రత్యర్థి పార్టీలు కమిషన్‌కు ఫిర్యాదు చేశాయి. దీనిపై విచారణ చేపట్టిన ఎన్నికల అధికారి కలెక్టర్ శ్రీధర్ దీనిని నిర్ధారించడంతో డ్యూటీలో ఉన్న దక్శిలి ఎస్‌ఐ శేఖర్‌బాబు, దగదర్తి ఎఎస్‌ఐ చిన్నయ్యలను, మరో ఎనిమిది మంది కానిస్టేబుళ్లను సస్పెండ్ చేశారు.

### మద్యం మత్తులో డ్రైవింగ్

పూటుగా మద్యం సేవించి బస్సును నడప డంతో పలువురికి గాయాలైన ఘటన మార్చి 5వ తేదీ చోటుచేసుకొంది. రాత్రి 9.30 గంటల సమ యంలో బుజబుజనెల్లూరు నుంచి వస్తున్న బస్సు గాంధీబొమ్మ వద్దకు వచ్చేసరికి అక్కడ ఉన్న ప్రయా ణికులు, వాహనాలపై ఎక్కేసింది. అదృష్టవశాత్తు చిన్న చిన్న గాయాలతో తప్పించుకోగా అక్కడే మరో కారు, స్కూటర్ దెబ్బతిన్నాయి. ఆ బస్సు డ్రైవర్ స్పృహలో లేనంతగా మద్యం తాగి ఉండడంతో గమ నించిన స్థానికులు పట్టుకొని దేహశుద్ధి చేశారు. అక్కడకు వచ్చిన వన్‌టౌన్ ఎస్‌ఐ డ్రైవర్‌పై చర్య తీసుకోవాల్సిందిపోయి స్థానికులనే అరిచాడట. ఇలాంటి ఘటనలు సర్వసాధారణం అయినా మద్యం త్రాగి డ్రైవర్లు బస్సులు నడుపుతున్నా పోలీస్, రవాణా శాఖ అధికారులు పట్టించుకోవడం లేదు.

### తూర్పు కనుపూరు ముత్యాలమ్మ జాతర

తూర్పు కనుపూరులో ముత్యాలమ్మ జాతర ఈ నెల 20వ తేది నుంచి 24వ తేదీ వరకు వైభ వంగా నిర్వహించనున్నట్లు ఆలయ ధర్మకర్తల మం డలి అధ్యక్షుడు వేమారెడ్డి మురళీమోహన్‌రెడ్డి విలే కరుల సమావేశంలో తెలిపారు. ఈ ఉత్సవాలకు రాష్ట్రం నలుమూలల నుంచేగాక తమిళనాడు, కర్నా టక రాష్ట్రాల నుంచి అధిక సంఖ్యలో భక్తులు హాజ రవుతారని చెప్పారు. భక్తుల సౌకర్యార్థం దాతల సహకారంతో ఆలయ ప్రాంగణాన్ని సర్వాంగ సుం దరంగా తీర్చిదిద్దడంతోపాటు మంచినీటి సౌకర్యం, స్నానపు గదులు, మరుగుదొడ్లను నిర్మించామ న్నారు. ఈ సమావేశంలో గూడూరు సబ్ కలెక్టర్ వీరపాండియన్, ఆలయ కార్యనిర్వహణాధికారి ఆవుల వెంకటేశ్వర్లు, దేవస్థానం మాజీ అధ్యక్షుడు సింహాద్రి మనోహర్ పాల్గొన్నారు.

### జడ్.నవనాధరావు మరణం

నెల్లూరు సాయిబాబా మందిరం దగ్గర 50 ఏళ్లకు పైగా సిద్దార్థ లాబొరేటరీని నిర్వహిస్తున్న మంచి మనిషి, బహుముఖ ప్రజ్ఞాశాలి జాగాబత్తిన నవనాధరావు(75) 6వ తేదీ మరణించారు. బైపాస్ చేయించుకొని హుషారుగా తిరుతుండిన నవనాధ రావుకు అకస్మాత్తుగా పక్షవాతం రావడంతో తట్టుకో లేక పోయారు. నవనాధరావు మంచి రంగస్థల నటుడు, రచయిత, దర్శకుడు. ఎన్నో పరిషత్ నాట కాలలో వందలాది బహుమతులు గెలుచుకొన్నాడు. విజయమహల్‌గేటువద్ద సిద్దార్థ చిన్నపిల్లల ఆసు పత్రి నిర్వహిస్తున్న డాక్టర్ శివప్రసాద్, నెల్లూరు పెద్దాసుపత్రిలో ఫోరెన్సిక్ నిపుణుడు డాక్టర్ శశి కాంత్ ఆయన కుమారులే. తాను కష్టపడి పైకిరావ డంతోపాటు బిడ్డలను ప్రయోజకులను చేసిన నవ నాధరావు అభినందనీయులు.

కుటుంబ పెద్దను కోల్పోయిన వారి కుటుం బానికి మా సానుభూతి.

## పదరంగం -5

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | | | | | 2 | | 3 | | |
| | | | | | | | | | | |
| 4 | 5 | | | | | 6 | | | | 7 |
| | | | | 8 | 9 | | | | 10 | |
| | | | | | | | | 11 | | |
| | 12 | | | | | | | 13 | | |
| 14 | | | | 15 | | 16 | | | | 17 |
| | | | 18 | | | | | | | |
| 19 | | 20 | | | | | | | | 21 |
| 22 | | | | | | 23 | | | | |
| | | 24 | | | | 25 | | | | |

**అడ్డం**

1. అనుకున్నది జరగడం (5)
3. సమయం (3)
4. దండోరా (3)
6. ఇంకెవ్వరు? సుయోధనుడే (3)
8. విశ్వంభర - కర్త (3)
11. సూర్యుడే (3)
12. జిహ్వానందం (3)
13. దంచడం - అసమాపకం (2)
14. చాళుక్యుల వంశం (3)
15. స్టమక్ (3)
17. అటు ఇటు అయిన ఇటుక (3)
20. యవ్వనం (4)
21. బ్రిటీష్ పాలకుడు అటునుంచి వచ్చాడు (3)
22. కోరిక కలవాడు (2)
24. వక్కలు (3)
25. బ్రహ్మర్షి (5)

**నిలువు**

1. కష్టం, ఇబ్బంది (4)
2. అమితాబ్ బచ్చన్ ఫ్యామిలీ సాంగ్ (4)
3. తక్కెడ (3)
5. శివకుమార్ (5)
7. క్రింద నుంచి పాదం (3)
8. క్రింద నుంచి వినాయకుని పత్నులు (4)
9. దేవుని నమ్మినవాడు (4)
10. ఎండమావి (4)
11. అయస్కాంతం (5)
12. రాబడి (3)
16. మరల (2)
17. రెండు పదులు (3)
18. పొలం పనికి ప్రారంభోత్సవం (4)
19. రూపు దిద్దుకోవడం (3)
23. పూలవాసన (2)

**సమాధానాలు**

## పదరంగం -4

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1ఉ | ప | 2శ | మ | 3నం | | | 4చె | | 5ఐ | 6తె |
| లి | | మీ | | 7ది | 8న | క | రు | డు | | లం |
| | 9ఆ | వృ | త్తం | | టి | | వు | | 10లం | గా |
| 11క | టా | క్షం | | 12జా | | | లు | | | ణ |
| | పా | | 13పా | రు | ద | ల | | 14తా | | |
| 15వా | టా | దా | రు | డు | | | | 16తా | 17పం | |
| మ | | | వే | | 18దా | య | 19ని | | 20చ | లి |
| న | | 21బా | ట | 22సా | రి | | య | | దా | |
| 23గుం | పు | లు | | లె | | 24మ | తి | 25మ | ర | 26పు |
| ట | | రు | | గూ | | రు | | ది | | ర |
| లు | 27మే | | 28వే | డు | క | లు | | 29ర | ణ | ము |

# సంక్షిప్త సింహపురి

## ఛాన్స్ కొట్టిన వన్ టౌన్ ఎస్ఐ!

నెల్లూరు నగరంలో ఎస్ఐలుగా యువకులను ఎస్పీ నియమించడంతో వాళ్లు కరకుగా డ్యూటీ చేస్తున్నారు. ఫోర్త్, ఫిఫ్త్‌టౌన్ ఎస్ఐలు ఇప్పటి వరకు న్యాయంవైపే నిలబడి పనిచేస్తున్నారు. కానీ వన్‌టౌన్‌లో లా అండ్ ఆర్డర్, క్రైంతోపాటు ట్రాఫిక్ వ్యవహారాలు ఒంటి చేయిపై నెట్టుకొస్తున్న ఎస్ఐ పైకి మంచివాడుగా కనపడ్డా ఇటీవల ఈ ప్రాంతంలో 15 కోట్ల రూపాయలకు జనానికి టోపీ పెట్టిన అబ్దుల్ నయీం స్వేచ్ఛగా తిరిగేందుకు పూర్తిగా సహకరించాడట. దీనికిగాను ఎస్ఐ బావమర్దికి కారు కానుకగా పొందడంతోపాటు పెద్ద మొత్తంలో క్యాష్‌తో 'రెడ్డి'గారి జేబులు నింపినట్లు పెద్ద బజారు కోడైకూస్తుంది.

## అయ్యోరు... అపరిచితుడు!



ఇన్‌ఛార్జ్ డిసిసి అధ్యక్ష బాధ్యతలు మోస్తున్న చాట్ల నరసింహారావు పైకి కనపడినంత సరసుడు కాదు. ఆయనలో అపరిచితుడు దాగున్నాడని మైనార్టీ నేతలు ప్రెస్‌క్లబ్‌లో మెటికలు విరి చారు. నెల్లూరు మూలాపేటలోని నరసింహారావు ఇంటికి పదడుగుల దూరంలో రోడ్డుపై చాలా రోజుల నుంచి ఓ దర్గా ఉంది. దర్గా వెనుక మునిసిపల్ పాత మార్కెట్ స్థలం ఉంది. దురాలోచనలతో దర్గాను ఆనుకొని ఓ వినాయకుడి గుడిని తన తండ్రిపేర నరసింహారావు నిర్మించారు. మతసమైక్యత మూలపేటలో పరిఢవిల్లుంతుందని అందరూ అనుకొంటున్న సమయంలోనే ఆయన ఈ వారం దర్గా పడమర వైపు మునిసిపల్ టౌన్ ప్లానింగ్ అధికారులతో కలిసి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు నెరపి ధ్వంస రచనకు పూనుకోబోయాడు. మైనార్టీ మహిళలు ప్రతిఘటించడంతో ఈ వ్యవహారం సద్దుమణిగింది. వ్యవహారం సాఫీగా సాగిపోతున్న దర్గా - దేవాలయం ప్రాంతంలో నరసింహారావుకు పుట్టిన దుర్బుద్ధి మునిసిపల్ పాత మార్కెట్ స్థలాన్ని ఆక్రమించుకోవాలనే పుట్టి ఉంటుందని ఈ ప్రాంతీయులు సణుగుతున్నారు. దీనికి అయ్యోరు ఏమంటాడో?

## కోపాల్... పాపాల్... శాపాల్!

మహాకవి శ్రీశ్రీ మహా ప్రస్థానంలో అలవోకగా చెప్పిన పై కవితలోని పరిస్థితులు కోవూరు ఉపఎన్నికల సందర్భంగా ప్రస్ఫుటమవుతున్నాయి. కాంగ్రెస్ తరపున పోటీలో ఉన్న పోలంరెడ్డి శ్రీనివాసులురెడ్డి వ్యక్తిగతంగా మంచివాడు. కానీ ఆయన్నే కోపాల్... పాపాల్... శాపాల్ వెన్నాడుతున్నాయి. ఎన్నికల ఇన్‌ఛార్జీలుగా నియోజకవర్గానికి సంబంధంలేని వ్యక్తులను నియమించడంతో స్థానిక నాయకులు లోలోన రగిలిపోతున్నారు. మా మద్దతు లేకుండా ఎలా గెలుస్తారో చూద్దామని కొందరు కోపంతో రగిలిపోతుంటే; ప్రచార పిలుపుకు నోచుకోని మరికొందరు నేతలు కోవూరు శీనయ్య ఓడిపోవాలని జొన్నవాడ కామాక్షమ్మకు మొక్కుకోవడం ఆ నోటా ఈ నోటావిని పోలంరెడ్డి లోలోన మధనపడుతున్నట్లు తెలిసింది.

## లేడీస్ టైలర్‌కు సన్మానం



నెల్లూరు టైలర్స్ వెల్ఫేర్ అసోసియేషన్ నేతృత్వంలో టౌన్‌హాల్‌లో జరిగిన టైలర్స్ డే వేడుకల్లో మాగుంట లేఅవుట్‌లోని శివానీస్ బొటిక్‌కు చెందిన లేడీస్ టైలర్ వల్లూరు శ్రీనివాస్‌ను సన్మానించారు. స్త్రీల దుస్తుల రూపకల్పనలో శ్రీనివాస్ సిద్ధహస్తుడని అసోసియేషన్ అధ్యక్షుడు పైడా వెంకటేష్ ఈ సందర్భంగా ప్రశంసించారు.

## రక్తదాత కుటుంబ ఔదార్యం



రక్తదాత పెళ్లకూరు గోపికృష్ణకు మూత్రపిండాలు చెడిపోవడంతో ఆయన చికిత్స నిమిత్తం దాతలు కొంత మొత్తమిచ్చారు. కానీ ఆ డబ్బులు ఆయనకు అక్కరకు రాకుండానే కన్నుమూశారు. వచ్చిన మొత్తం ఆయన శ్రీమతి సుభద్రాదేవి దగ్గర ఉండగా సింహపురి స్వచ్ఛంద రక్తదాతల బృంద నేత తిక్కవరపు సుకుమార్‌రెడ్డి రక్త సహాయోద్యమానికి ఇవ్వమని అడిగారట. ఆమె ఈ కోర్కె తీర్చకుండానే మరణించినా వారి బంధువు కోడూరు చంద్రశేఖర్‌రెడ్డి తన దగ్గర ఉండిన గోపీకృష్ణ కుటుంబీకులకు ఇవ్వాల్సిన మొత్తం 49,500 తిరిగి ఇచ్చేయడంతో ఈ మొత్తాన్ని కలెక్టర్‌ను 1వ తేదీ కలసి ఇచ్చినట్లు తిక్కవరపు సుకుమార్‌రెడ్డి చెప్పారు. ఈ కార్యక్రమంలో చంద్రశేఖర్‌రెడ్డి, డాక్టర్ ఎ.వి.సుబ్రహ్మణ్యం, గూడూరు లక్ష్మి తదితరులు పాల్గొన్నారు. మొత్తానికి ప్రజాధనం 27 సంవత్సరాల తర్వాత తిరిగి ప్రజలకు ఉపయోగపడడం విశేషం.



# రైతు లోకం రబీ వేరుశనగలో లద్దె పురుగుల నివారణ!

రబీ సీజన్‌లో దాదాపు 6800 హెక్టార్లలో బావులు, తుంపర్ల సేద్యం కింద వేరుశనగ పంటను పండిస్తున్నారు. సగటున హెక్టారుకు 1812 కిలోల కాయ దిగుబడి వస్తుంది. వేరుశనగ గింజలలో 48-50 శాతం నూనె, 26-28 శాతం మాంసకృత్తులు, 15-17 శాతం పిండి పదార్థాలుంటాయి. ఇంతేకాకుండా ఆరోగ్యానికి అవసరమైన విటమిన్ 'ఇ' థైమీన్, రైబోఫ్లేవిన్, ఫోలిక్ ఆమ్లం, విటమిన్ 'కె', కాల్షియం, మెగ్నీషియం, జింకు, ఇనుము, పొటాషియం, విటమిన్-బి మొదలైనవి వుంటాయి. క్యాన్సర్‌ను తగ్గించే యాంటి ఆక్సిడెంట్స్ ఎక్కువగా వుంటాయి. కాబట్టి నూనె గింజల పంటగానే కాకుండా మంచి పోషక విలువలున్న పంట కావడంతో రుచికరమైన తినుబండారాల తయారీలో విరివిగా వినియోగిస్తారు.

పరిశోధన ఫలితాల ఆధారంగా సిఫారసు చేసిన సాగు పద్ధతులను పాటిస్తే అధిక దిగుబడి పొందవచ్చు. వేరుశనగ పంటను వివిధ రకాల పురుగులు ఆశిస్తుంటాయి. వీటిని నివారించేందుకు వ్యవసాయ శాస్త్రవేత్తల సూచనలు, సలహాలు తీసుకొని మందులను వినియోగించాల్సి వుంటుంది.

### లద్దె పురుగు:

ఈ పురుగు ఆకులను కొరికి తిని నష్టం కలిగిస్తుంది. దీనిని మొదటి దశలోనే నివారిస్తే పంటకు నష్టం కలుగదు.

### నివారణ:

ఆముదపు చెట్లను గట్లపైన వేరుశనగ కంటే ముందు వేయాలి. భూమిని లోతుగా 3,4 సార్లు దున్నాలి. దీపపు ఎరలు, లింగాకర్షణ ఎరలను ఎకరాకు నాలుగు చొప్పున వుపయోగించి పురుగు ఉధృతిపై నిఘా వుంచాలి. గుడ్ల సముదాయాన్ని, చిన్న గొంగళి పురుగులు ఆశించిన జల్లెడాకులను గుర్తించి నాశనం చేయాలి. విషపు ఎర ద్వారా పురుగులను చాలా వరకు నివారించవచ్చు. ఎకరాకు 5 కిలోల తవుడు, 1 కిలో బెల్లం, 500 మిల్లీలీటర్లు క్లోరిపైరిఫాస్ లేదా కార్బరిల్ 50 శాతం పొడి మందు 500 గ్రాములు 3 లీటర్ల నీళ్లలో కలిపి చిన్న వుండలుగా ఎరను తయారు చేసుకొని సాయంకాలం వేళల్లో పొలంలో వెదజల్లాలి. పొలంలోకి పెంపుడు కోళ్లు వెళ్లకుండా జాగ్రత్త తీసుకోవాలి. 20శాతం కన్నా ఎక్కువ ఆకులను తినేసినప్పుడు క్వినాల్‌ఫాస్ 2 మిల్లీలీటర్లు లేదా 2.5 మిల్లీలీటర్లు క్లోరిపైరిఫాస్ లేదా థయోడికార్బ్ 1 గ్రాము లేదా నొవల్యురాన్ 1 మిల్లీలీటరు చొప్పున ఒక లీటరు నీటికి కలిపిన మందు ద్రావకాన్ని పిచికారి చేసి ఎదిగిన లద్దె పురుగులను నివారించవచ్చు.

డాక్టర్ ఎం.రవీంద్రకుమార్ రెడ్డి,
ప్రధాన శాస్త్రవేత్త & కోఆర్డినేటర్,
ఏరువాక (డాట్ సెంటర్), నెల్లూరు.

# గెలవకుంటే కొంపలు మునిగిపోతాయన్న ఆరాటంలో మూడు పార్టీలు!

కోవూరులో జరుగుతుండేది సాధారణ ఉపఎన్నిక. శాసనసభ బలాబలాలతో పోలిస్తే దానికి ప్రాధాన్యతే లేదు. ఎవరు గెలిచినా ఒకటే. ఏ మార్పూ వుండదు. కానీ మూడు పార్టీల అగ్రనేతలూ దాని కోసం చెమటలు కారుస్తున్నారు. సర్వం ఒడ్డుతున్నారు. చావు బ్రతుకుల సమస్యగా పరిగణిస్తున్నారు. ఇక్కడ గెలవకుంటే కొంపలు మునిగి పోతాయనే ఆరాటం ప్రదర్శిస్తున్నారు. అన్ని పనులూ మానుకొని ఇక్కడే చక్కర్లు కొడుతున్నారు.

## బాబుకు అలవాటు లేని పని

అందరి కంటే ముందు చంద్రబాబు 4తేది కోవూరు వచ్చాడు. బుచ్చిరెడ్డిపాళెం మండలంలో దాదాపు పదిహేను గ్రామాలలో యాత్ర జరిపాడు. రెండవ విడతగా 8తేది వచ్చాడు, రెండు మండలాలు చుట్టి వెళ్లాడట. ముచ్చటగా మూడవసారి 15తేది మళ్లీ రాబోతున్నాడు. కొరవాసరవా అప్పుడు పూర్తి చేస్తాడు. చంద్రబాబుకు అలవాటు లేని పని అది. గతంలో ఏ ఎన్నికలో కూడా ఆయన గ్రామగ్రామం వెళ్లి ఓట్లు అభ్యర్థించిన దాఖలాలు లేవు. దాన్నిబట్టే ఆయన ఈ ఎన్నికలలో గెలుపు కోసం ఎంతగా వెంపర్లాడుతున్నదీ అర్థం చేసుకోవచ్చు. చంద్రబాబు తొలి పర్యటన కొంత వరకు బాగానే జరిగినట్లు చెప్పవచ్చు. కమ్యూనిస్టుల ప్రాబల్యం బాగా వుండే దామరమడుగులో ఆయన్ను జనం పట్టించుకోలేదు. ప్రచారరథం గ్రామం మధ్యలో ఆపి, గొంతు చించుకొన్నా వూళ్లోని జనం వినిపించుకోలేదు. కానీ తెలుగుదేశం నేత ఎర్రంరెడ్డి గోవర్ధన్‌రెడ్డి స్వగ్రామమైన రేబాలకు వెళ్లేసరికి మార్పు కనిపించింది. ఆయన నేతృత్వంలోనే నడిచిన బుచ్చి బహిరంగ సభ కూడా జనసమర్థంగా జరిగింది.

## జగన్‌కు చేదు అనుభవం

వైఎస్.జగన్ 5వ తేది వచ్చి, ఇక్కడే మకాం పెట్టి వున్నాడు. అనుకొన్న దానికంటే ఒకరోజు అదనంగా వుండబోతున్నాడు. ఆయన పర్యటన తీరు చూస్తుంటే నియోజకవర్గంలోని ప్రతి ఓటర్నూ స్వయంగా పలకరించి ఓటు అభ్యర్థించాలన్న ధోరణి కన్పిస్తున్నది. ఒక్కొక్క గ్రామంలో మూడు నాలుగు చోట్ల ప్రచార రథం ఆపి, అవ్వా, అక్కా, అన్నా అంటూ పలకరింపులు చేస్తున్నాడు. అభ్యర్థి నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి కూడా అంత విస్తృతంగా ప్రచారం చేసి వుండడనడం నిజం. తానే అభ్యర్థిని అన్నంత స్థాయిలో ప్రచారం చేస్తున్నాడు జగన్. ఒక పార్టీ రాష్ట్ర అధ్యక్షుడు ఈ స్థాయిలో ప్రచారం చేసి, ఎన్నికలు జరిపించడం విచిత్రమైన విషయం. సాధారణ ఎన్నికలైతే అది అసంభవం. తెలంగాణలోని ఆరు ఉపఎన్నికలలో పోటీ పెట్టకుండా ఒక్క కోవూరుకు మాత్రం పరిమితమయ్యాడు కాబట్టి, ఈ విస్తృతస్థాయి వీలౌ తున్నది. ఇప్పటికే కొడవలూరు, విడవలూరు, ఇందుకూరుపేటలో జగన్ ప్రచారం పూర్తి అయ్యింది.

జగన్ పేరు చెప్తే జనం ఎగబడి వస్తారన్నది అందరికీ తెలిసిన నిజం. కారణం ఏదో తెలియదు కానీ, కొన్ని చోట్ల అది జరగడం లేదు. కొడవలూరు, దామేగుంట, కొత్తవంగల్లు, తలమంచి వంటి గ్రామాలలో జగన్‌ను జనం పెద్దగా పట్టించుకోలేదు. ఎగబడి రాలేదు. ఈ గ్రామాలన్నీ వెనుకబడిన తరగతుల వారు అధికంగా వుండేవి గమనార్హం. ఆ నీరస వాతావరణం చూసి పక్కరోజు జన సమీకరణకు పెద్ద ఎత్తున ఏర్పాట్లు చేసుకొన్నారు స్థానిక నేతలు. ఇందుకూరుపేటలో జగన్ స్వాగతానికి పోట్లపూడి వంటి గ్రామాల నుంచి జనాన్ని రప్పించారు. పల్లెల్లో అటువంటి ప్రయోగాలు సులభంగా అర్థమైపోతాయి. విడవలూరులో మాత్రం జగన్ ప్రచారం జన సమర్థంగా జరిగింది.

## చిరుపై మొత్తం బరువు

ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి 9తేది కోవూరు వస్తున్నాడు. నార్త్ రాజుపాళెం దగ్గర జాతీయ రహదారిని ఆనుకొని వున్న విశాలమైన ఖాళీ స్థలంలో భారీ బహిరంగ సభ నిర్వహించబోతున్నారు. 50వేల మంది జనాన్ని సమీకరించాలని ప్రయత్నమట. ఆయన పర్యటన ఈ ఒక్క సభకు పరిమితం కాబోతున్నది. కొరవా సరవా బాధ్యత చిరంజీవి, బొత్సా సత్తిబాబులు తమ భుజాల మీద వేసుకొంటున్నారు. వారు మూడు రోజులకు పైగా ఇక్కడే విడిది దిగనున్నారని వార్త. రాష్ట్ర మంత్రులు ఆనం రామనారాయణ, పితాని సత్యనారాయణ, మోపిదేవి వెంకటరమణ విస్తృతంగా తిరుగుతున్నారు.

## ప్రచారంలో ప్రసన్న పైచెయ్యి

ఇక అభ్యర్థుల పరంగా చూస్తే ప్రచారంలో కానీ ఎన్నికల యంత్రాంగం నిర్వహణలో కానీ జగన్ పార్టీ అందరి కంటే ముందు వుందని చెప్పక తప్పదు. చాలా పకడ్బందీగా పని చేసుకొని పోతున్నారు వారు. స్థానిక కార్యకర్తలతో పాటు, నెల్లూరు నుంచి గ్రామానికి పది మంది విద్యార్థులను తరలించారు. వారు ఇల్లిల్లు తిరిగి, కరపత్రం ఇచ్చి, ఓటు అభ్యర్థిస్తున్నారు. తెలుగు దేశానికి గ్రామ స్థాయిలో నాయకుల కొరత కన్పిస్తున్నది. తమకు అనుకూలమైన ఓటర్లను సమీకరించుకోవడానికి కూడా ఇబ్బందులు ఎదురౌ

కొరవ 14వ పేజీలో



Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com